శ్రీ

# శారదాకాంచిక

చతుర్థకింకిణి,

అనఁగా

# గ్రామ్యభాషాప్రయోగనిబంధనము.

"కళాప్రపూర్ణ" "సర్వతంత్రస్వతంత్ర" "మహోపాధ్యాయ"

త్ర్యసంఖ్యాకబిరుదవిరాజితులు

బ్రహ్మశ్రీ, వేదము - వేంకటరాయశాస్త్రులవారిచే

విరచితము.

రెండవకూర్పు.



ప్రకాశకులు.

తత్పౌత్రులు,

వేదము - వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4, మల్లికేశ్వరగుడి సందు, లింగిశెట్టివీథి,

మన్నడి, జి. టి. మదరాసు.

1934



వెల. అ. 12.

# విషయసూచిక.


| విషయము. | పుటం. |
|---|---|
| 1. ఔచిత్యము సర్వోత్కృష్టప్రమాణము. | ౧ |
| 2. ఔచిత్యము వ్యాకరణశాస్త్రమునకుం బ్రమాణము. | ,, |
| 3. స్వభావవర్ణనమందు గ్రామ్యప్రయోగానుశాసనము. | ౨ |
| 4. నాట్యము వినోదకరణము. | ,, |
| 5. నాట్యము స్వభావానుకరణము. | ౩ |
| 6. గ్రామ్యము స్వభావసిద్ధము, శిష్టప్రయుక్తము. | ౫ |
| 7. ప్రాకృతము సంస్కృతగ్రామ్యమే. | ౯ |
| 8. భాషాభేద నిర్వహణమునకు ఔచిత్యమే మూలము | ౧౧ |
| 9. మ్లేచ్ఛాదిభాషలుఁగా ఆంధ్రగ్రామ్యమును మార్పవలయును. | ,, |
| 10. భాషావిభాషలకు లోకమే ప్రమాణము. | ౧౪ |
| 11. ప్రకృతగ్రామ్యభాషా ప్రతిషేధాభాసము. | ,, |
| 12 నిరుపక్రమ గ్రామ్యమునకుం బ్రతిషేధమని తెల్పుట | ౧౫ |
| 13. భాష్యమందలి యపశబ్దప్రతిషేధము | ౧౬ |
| 14. భాష్యపరామృష్టాపశబ్దములు ప్రాకృతభాష. | ౧౭ |
| 15. అపశబ్దానుకరణమునకు భాష్యానుజ్ఞ. | ౧౯ |
| 16. ప్రాకృతభాషల గ్రామ్యతకు మఱికొన్ని ప్రమాణములు. | ౨౧ |
| 17. అపభ్రంశగ్రామ్యత. | ౨౮ |
| 18. నీచపాత్రములకు అపభ్రంశప్రయోగానుశాసనము. | ,, |
| 19. పాత్రోచితగ్రామ్యము జాత్యలంకారమని భోజరాజు. | ౨౯ |
| 20. పురాణరూపకగ్రామ్యము సౌలభ్యార్థమఁట. | ౩౫ |
| 21. సలక్షణములగుటచే ప్రాకృతములు ప్రయుక్తము లఁట! | ౩౬ |
| 22. నీచపాత్ర గ్రామ్యముచే భాష చెడునఁట! | ౩౮ |
| 23. ప్రకృతగ్రామ్యము సింగభూపాలానుశిష్టము. | ౩౯ |
| 24. గ్రామ్యనిషేధ నాటకనిషేధములు అనుమేయము లఁట! | ౪౩ |
| 25. రూపకలక్షణ ప్రమాణగ్రంథములు. | ౪౭ |
| 26. ఆంధ్రలక్షణకారుల రూపకరచనానుజ్ఞ. | ౪౯ |
| 27. ఓఢ్రాదిభాషాగ్రహణదూషణము. | ౫౫ |
| 28. గ్రామ్యము ప్రహసనములందుమాత్రము ప్రయోక్తవ్యమఁట! | ౫౯ |
| 29. పూర్వపక్షుల "డ్రామాల" స్వరూపము. | ,, |
| 30. అనౌచిత్యమే గ్రామ్యత్వమని రుద్రటోక్తి. | ౬౧ |
| 31. నీచపాత్రములకు గ్రామ్యము పెట్టని నాటకములు గ్రామ్యనాటకములు. | ,, |
| 32. అట్టినాటకము లాడవలదని భరతముని శాసనము. | ౬౪ |
| 33. ఉపసంహారము. | ,, |

# ఇందుదాహృతగ్రంథములు.

1. మహాభాష్యము.
2. శబ్దకౌస్తుభము.
3. భరతమునినాట్యసూత్రము.
4. సరస్వతీకంఠాభరణము.
5. రసగంగాధరము.
6. కావ్యప్రకాశము.
7. రుద్రటునికావ్యాలంకారము.
8. కథాసరిత్సాగరము.
9. సాహిత్యదర్పణము.
10. కావ్యాదర్శము.
11. షడ్భాషాచంద్రిక.
12. వికృతివివేకము.
13. కవిశిరోభూషణము.
14. వాచస్పత్యము.
15. అమరకోశము.
16. గౌడవహము:-ముద్రకుని పీఠిక
17. వీబరు(Weber's Indian Literature.)
18. దత్తుఁడు (Dutt's Ancient India.)
19. విల్సను (Wilson's Hindu Theatre )
20. విల్లియంస్ (Monier Williams' Sakuntala—Introduction.)
21. హృషీకేశశాస్త్రికృత ప్రాకృత వ్యాకరణము.
22. చంద్రశేఖరశతకము.
23. నన్నయభట్టీయము.
24. అప్పకవీయము.
25. శ్రీకాళహస్తిమాహాత్మ్యము.
26. మనుస్మృతి.
27. డ్రైడెను (Dryden.)
28. ముద్రారాక్షసము.
29. దశరూపకము.
30. రామాభ్యుదయము.
31. యయాతిచరిత్రము.
32. మనుచరిత్రము.
33. కవెల్ (Cowell's Introduction to Vararuchi's Prakrit Grammar.)
34. ప్రసన్నరాఘవనాటకము
35. సింగభూపాలీయము.
36. నరసరాజీయము.
37. కావ్యాలంకారచూడామణి.

శ్రీ

# అవతారిక.

---

ఇక్కాలమందు తండోపతండములుగా తెనుఁగునాటకము లుప్పతిల్లుచున్నవిగదా. ఇందు కొన్ని యనువాదములు, కొన్ని స్వతంత్రములు. సంస్కృతనాటకములం దొలితొలిం దెనిఁగించినవారు నడుమునుం బొడమిన తద్దేయ పాశ్చాత్యానువాదములమర్యాద నవలంబించి తమ యనువాదములయందు సంస్కృతమూలములందలి ప్రాకృతాదిభాషాభేదప్రపంచప్రయోజనమును నిర్వహింపరైరి. స్వతంత్రనాటకములవారును ఈ విషయమున పూర్వోక్తానువాదకులకు గతానుగతికులైరి. ఇట్లు జరుగుచుండఁగా ఔచిత్యాభిమాను లొకకొందఱు సంస్కృతనాటకమర్యాదను తల్లక్షణమును అనుసరించి తమయనువాదములందును తమ స్వతంత్రనాటకములందును ప్రాకృతాదిభాషాభేదప్రపంచప్రయోజనమును గ్రామ్యభాషాభేదములచే నిర్వహింపందొడంగుదు, మఱికొందఱు, అంతకుమున్ను తమరచించినయనువాదములందు తన్మూలగీర్వాణవాణీనాటకగతభాషాభేదప్రయోజనమును నిర్వహింపక ఏకరూపముగా సంస్కృతప్రాకృతములకు వ్యాకృతాంధ్రమే పెట్టినవారయ్యును, భాషాభేదప్రయోజననిర్వహణధూర్వహములయిన పూర్వోక్తరూపకములవలన ఆప్రయోజనంపుఁగలిమిం బొడగని, తదనంతరము తారు రచియించిన నాటకములందు అట్టిభేదముం బాటింప సమకట్టిరి, కాని, ప్రాకృతాదులకు గ్రామ్యములం బెట్టక అచ్చతెలుఁగుం బెట్టసాగిరి. ఇట్లీనాటకము లెల్ల అభేదములు, అచ్ఛగ్రాహులు, గ్రామ్యగ్రాహులు నని ముత్తెగలయినవి. అయినను ప్రకృతోపయోగార్థము ఈముత్తెగలను గ్రామ్యగ్రాహులు గ్రామ్యత్యాగులునని యిరుదెగలు సేయవచ్చును. ఏతత్కవులలో గ్రామ్యత్యాగులు తమసంస్కృతనాటకానువాదములలో నీచపాత్రములకు ఉత్తమభాషం బ్రయోగించి భరతోక్తలక్షణమునకుం దప్పి, తమ

స్వతంత్రనాటకములందును భరతముని ప్రోక్తమార్గము నించుకేనియు ననుసరింపక, స్వేచ్ఛామార్గమునం బడినారు. కాని, సలక్షణము, అలక్షణము, అను వాగ్వ్యవహారమును మాత్రము మానినవారుగారు. పైగా వార్తాపత్త్రికలలో భరతమతానుసారి గ్రామ్య గ్రాహినాటకములను గ్రామ్యహేతువు చేఁ దెగడుచున్నారు. గ్రామ్యగ్రాహులును తత్త్యాగినాటకములను అలక్షణములనుచున్నారు. కావున నివ్విషయంబున నాట్యశాస్త్రోపదేష్టలును తత్ప్రచయితలు నయిన పెద్దలసిద్ధాంతముం బ్రకటించుట పెక్కుభంగుల లోకారాధనంబని తలంచి తదర్థమై రచించి యీకింకిణిని శ్రీశారదాదేవతకు నేనిప్పటికే అర్పనము చేసియున్న కాంచికలో గ్రుచ్చినాఁడను.

ఇందుదాహరించిన ప్రమాణములయందు తదాకరగతలేఖకముద్రకాది స్ఖాలిత్యములను మార్చ నిజమతానుకూలముగా మార్చితినను మాట పుట్టునో యనిశంకించితి.

ఈగ్రంథమును 1899-వ సం॥ జూన్ నెల 4-వ తేదిని నెల్లూరి యాంధ్రభాషాభిమాని సమాజమువారికోరికపై రచియించి వారి మహాసభయందు చదివినాఁడను.

ఇది యముద్రితదశయందుండుటను మన్మిత్త్రులును ధారాకోట సంస్థానపు దివానుగారునగు శ్రీబోడపాటి రాజన్నపంతులు బి. ఏ. గారి వలన విని ఏతన్ముద్రణమునకై ధనమొసంగిన పర్లాకిమిడిసంస్థానపు ద్వితీయ యువరాజుగారగు శ్రీ శ్రీ శ్రీ పద్మనాభనారాయణదేవురాజావారియెడ నాకృతజ్ఞతను లోకమునకుం దెలుపుకొనుచున్నాఁడను.

మదరాసు.
జనవరి, 1901.

వే - వేంకటరాయశాస్త్రి.

# విజయవిలాసము.

చేమకూర వేంకటరాజ ప్రణీత పద్యకావ్యము. అద్దములోని లిబ్బివలె రసికులకు నబ్బియు నబ్బనియర్థములచే నబ్బుర మొసంగుచు, కాకలీగీతముంబోలె మధురంబయ్యు నస్ఫుటంబై రసికగోష్ఠులయందు సందేహాంతచర్యలకుం గారణంబైన కాకిమెలకువలతో నిండి సాపూర్ణాను భవంబునకు రాక యున్నట్టి యీరసోత్తరప్రబంధము ఎల్లవారికిని సుబోధంబగునట్లు శాస్త్రులవారి వ్యాఖ్యానముతో మరల ముద్రితమగు చున్నది.

---

# సారంగధర చరిత్రము.

పుణ్యావిశేషలబ్ధమృదుమధురవాగ్వైభవంబున చేమకూర వేంకటపతి అమృతంపుఁగూరగా రచించిన యీభవ్యప్రబంధము, సాహసిక ముద్రణములపాలై ఈవితీవియ పూదండ చెత్తతోఁ ట్టింబడిన కరణిం బుర ణించుచుండంగని బాగుపఱిచి సటీకముగా శ్రీ శాస్త్రులవారు ముద్రించి యున్నారు. పూమొగ్గలువోలె తామే విడు శ్లేషలును ద్రాక్షాపాకంబున నోరూర రసమొల్కు రచనలును, వినివింపని వర్ణనలును, బరువులు నెరు వులుంగాని తోడవులును దీనిని అమృతీకరించినవి. 1 4

---

# ఆంధ్ర హితోపదేశ చంపువు.

చిన్నితరగతుల యందలి బాలురకు బాలికలకును సులువుగా బోధ యగునట్టి శైలిలో సంస్కృతహితోపదేశమునను శ్రీ శాస్త్రులవారు కావించిన యాంధ్రానువాదము. 1 4

# ఆంధ్ర సాహిత్యదర్పణము.

విశ్వనాథ కవిరాజకృత సంస్కృతగ్రంథమునకు సరియైన యాంధ్రానువాదము. మూలమునందలి ఉదాహరణ శ్లోకములతో చేర్చి ముద్రించితిమి. ప్రథమభాగము. ఇప్పుడే వెలువడినది. 3 0

---

# బొబ్బిలియుద్ధనాటకము.

ద్వితీయముద్రణము ఇప్పుడే వెలువడినది. ఈచిన్నిపాత్రమున శీలసంరక్షణముకై కుసుమసుకుమారముల నాత్మవపువుల నగ్నిసాత్కరించువారును నిజసదాచారమహిమచేత శాపానుగ్రహసామర్థ్యము కలవారును అగు నర్ధాంగలక్ష్ములచే విరాజిల్లుచు, నిజబాహుపరాక్రమముచేత ఆసేతువింధ్యాచలము జమీను లేర్పరించుకొని మానముకై ప్రాణమును తృణప్రాయముగా నొడ్డుచు, ప్రతాపరుద్రాది రాజాధిరాజాధిష్ఠిత హిందూరాజ్య సంస్థాపకులై క్షత్రధర్మౌదార్య వైదుష్యములచేత భీష్మ విక్రమ భోజులను మరపించుచుఁ ఈశ్వరశబ్దము అనన్యవిషయమై పరమశివుని యందే వర్తించునట్లుగా దొరశబ్దము అనన్యకులనామసాధారణముగా తమకులనామముతోనే సుఘటితమై వెలుగొందు ప్రాభవముగల వెలమదొరలలో ఉదాహరణభూతులైన బొబ్బిలి మహావీరుల పుణ్యచరిత్రము కీర్తింపఁబడినది. 1 0

---

తాతవెల్లిమిరాదార్

శ్రీయుత శేషగిరిశాస్త్రులు, ఎమ్. ఏ. గారిగ్రంథములు.

ఆంధ్రశబ్దతత్త్వము మొదలైనవి అచ్చగుచున్నవి.

శ్రీ

# గ్రామ్యభాషాప్రయోగనిబంధనము.

ఔచిత్యము సర్వోత్కృష్ట ప్రమాణము.

విద్వద్భిస్సేవితః సద్భిర్నిత్యమద్వేషరాగిభిః।
హృదయేనాభ్యనుజ్ఞాతో యోధర్మస్తన్నిబోధత॥ మనువు

హృదయాభ్యనుజ్ఞచే నౌచిత్యము సూచితము. ధర్మార్థ కామ మోక్షము లనెడు నాల్గు పురుషార్థములకును ధర్మమే కారణము. కాన నౌచిత్య బాహ్యమెల్లశ్రేయోబాహ్యము. కావున శ్రేయస్సంపాదక విద్య లెల్ల నౌచిత్యానపేతములై యుండవలయును. ఔచిత్య విహీనములు ప్రమాణము గావు.

కావ్యము శ్రేయోర్థము.

"విశ్వశ్రేయః కావ్యమ్." నన్నయ.

కావ్యాత్మ రసము.

"వాక్యంరసాత్మకంకావ్యమ్." విశ్వనాథుఁడు.

"తదదోషౌపరిష్కృతౌచవాగర్థౌ।
సావాగ్వ్యాపరసవృత్తిః।
సాధ్యోహిరసో యథాతథంకవిభిః॥" నన్నయ.

రసార్థము వాక్కు. వాగర్థము శబ్దశాస్త్రము. కావున ఔచిత్య విపరీతమగునెడల శబ్దశాస్త్ర మప్రమాణము ఔచిత్యరక్షితమైనచో ప్రమాణము:—

"'తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి', అత్రేదం విచార్యమ్। త్రివిధైవ వికృతి రనియమా గ్రామ్యా భవతి, వర్ణన్యూన త్వాధిక త్వాన్యాదృశత్వ లక్షణా। తథాచ చతుర్విధా భాషేతి గ్రామ్యయా సాకం వికృత్యాశ్చాతుర్విధ్యం వదతః శబ్దశాసనా

చార్యస్య కుత్రచి ద్వినియోగ ఇష్ట ఏవ । అన్యథా తత్పరిగణనం ముధా స్యాత్ । వినియోగో హి నాన్యత్ర యుక్త ఇతి తత్తత్స్వభావవర్ణనే కార్యః । అత ఏవోక్త మథర్వణేన 'గ్రామ్యం తత్తద్విధా సాధు కణ కంఠముఖాహితాః' ఇతి."—కవిశిరోభూషణము

"యుక్తః" అనుటయే తద్గమకము. ఇందువలన గ్రామ్య ప్రయోగంబునకు విషయంబును తదనుశాసనంబును ఉపన్యస్తమైనవి. ఇట్లు వ్యాకరణ శాస్త్రము ఆత్మరక్షకముగా ఆత్మప్రమాణముగా ఔచిత్యము నుపన్యసించుకొను చుండఁగా, ఔచిత్య ప్రసక్తమైన గ్రామ్యమును ప్రతిషేధింప వ్యాకరణ సూత్రోపన్యాసము చేయుట సరిగాదు.

అనుశాసనోపన్యాసముచేతనే ఈనిబంధనగ్రంథము సమాప్తమైనది; కాని, శిష్టసంవాద ప్రదర్శనార్థము దీని నించుకంత విస్తరించెదను.

ప్ర॥ గ్రామ్యప్రయోగమున కౌచిత్య మెట్లుకలిగినది?

ఉ॥ కావ్యశాస్త్రసృష్టి వినోదకరణముగా ప్రార్థింపఁబడినది.

భరతనాట్యశాస్త్రము I

మహేన్ద్రప్రముఖైర్దేవై రుక్తఃకిలపితామహః
క్రీడనీయకమిచ్ఛామో దృశ్యంశ్రవ్యంచయద్భవేత్.
నచవేదవిహారోయం సంశ్రావ్యశ్శూద్రజాతిషు
తస్మాత్సృజాపరంవేదం పఞ్చమంసార్వవర్ణికమ్
ఉత్తమాధమమధ్యానాం నరాణాంకర్మసంశ్రయమ్
హితోపదేశజననం ధృతిక్రీడాసుఖాదికృత్.
వేదవిద్యేతిహాసానా మర్థానాంపరికల్పనమ్
వినోదకరణం లోకే నాట్యమేతన్మయాకృతమ్.

మఱియు,

ఆనన్దనిష్యన్దిషు రూపకేషు
వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః ।

యోఽవేతిహాసాదివ దాహ సాధుః
తస్మైనమః స్వాదుపరాఙ్ముఖాయ॥ దశరూపకము.

ప్ర॥ అగుఁగాక. గ్రామ్యముచే వినోదము అనుభవసిద్ధమా?

ఉ॥ లోకవ్యవహారమందును కొన్ని యెడల అనుభవసిద్ధమే. అనుకృతిచే ప్రయోగమందు నిశ్చితము అనుకృతి కిట్టి ప్రభావమెట్లన, అనుకార్యానుకృతుల సాదృశ్యబోధచే వినోదము కలుగును. అందులకై యనుకార్యము స్వభావసిద్ధమై ప్రసిద్ధమై యుండవలయును. కావున నే స్వభావానుకృతియే నాట్యముగా వినోదకరణముగా బ్రహ్మచే నిబంధింపఁబడినది. ఈ క్రింది భరతవాక్యములం గనుఁడు.

## XIX.

ఇతివృత్తంహినాట్యస్య శరీరంపరికల్పితమ్.
యోఽయంస్వభావోలోకస్య నానావస్థాన్తరాత్మకః
సోఽఙ్గాద్యభినయైర్యుక్తో నాట్యకంత్వభిధీయతే.
యస్మాత్స్వభావఃసంహృత్య సాఙ్గోపాఙ్గగతిక్రమైః
ప్రయుజ్యతేజ్ఞాయతేచ తస్మాదైవనాటకంస్మృతమ్.
లోకస్వభావంసంప్రేక్ష్య నరాణాంచబలాబలం
సంభోగంచైవయుక్తించ తతఃకుర్యాత్తునాటకమ్.

## XXI.

యథాజన్తుఃస్వభావస్థం పరిత్యజ్యాన్యదైహికమ్
తత్స్వభావంహిభజతే దేహాన్తరముపాశ్రితః.
వేషేణవర్ణకైశ్చైవ చ్ఛాదితఃపురుషస్తథా
పరప్రభావంకురుతే యస్యవేషముపాశ్రితః.

## XXII.

లోకసిద్ధంభవేత్సిద్ధం నాట్యంలోకాత్మకంత్విదమ్;
దేవతానామృషీణాంచ రాజ్ఞాంలోకస్యచైవహి:

పూర్వవృత్తానుచరితం నాట్యమిత్యభిధీయతే.
లోకస్యచరితంయత్తు *నానావస్థాన్తరాత్మకమ్
తదఙ్గాభినయోపేతం నాట్యమిత్యభిధీయతే.
ఏవంలోకస్యయావార్తా నానావస్థాన్తరాత్మికా
సానాట్యేసంవిధాతవ్యా నాట్యహేతోః ప్రయోక్తృభిః
యానిశాస్త్రాణియేధర్మాః యానిశిల్పానియాఃక్రియాః
లోకధర్మప్రవృత్తాని నాట్యమిత్యభిసంజ్ఞితమ్.
నచశక్యంహిలోకస్య స్థావరస్యచరస్యచ
శాస్త్రేణనియమంకర్తుం నానాచేష్టావిధింప్రతి.
నానాశీలాఃప్రకృతయః శీలేనాట్యంవ్యవస్థితమ్
తస్మాల్లోకప్రమాణంహి జ్ఞేయం నాట్యేప్రయోక్తృభిః.

XXVI.

స్వాభావికేనరూపేణ ప్రవిశేద్రఙ్గమణ్డపే
ఆత్మరూపంసమాచ్ఛాద్య వర్ణకైర్భూషణైరపి.
యాదృశంయస్యయద్రూపం ప్రకృత్యాతస్యతాదృశమ్
వయోవేషానురూపేణ ప్రయోజ్యం నాట్యకర్మణి.
యథాజీవః స్వభావంస్వం పరిత్యజ్యాన్యదైహికమ్
పరభావం ప్రకురుతే పరదేహముపాశ్రితః.
ఏవంబుధః పరంభావం సోస్మీతిమనసాస్మరన్
వేషవాగఙ్గలీలాభి శ్చేష్టాభిశ్చ సమాచరేత్.

I.

నాన్దీకృతామయా పూర్వమాశీర్వచన సంయుతా
తదన్తే †నుకృతిర్బద్ధాయథా దైత్యాస్సురైర్జితాః.

---

* వాఙ్క్రసయిత్తము అవస్థయే.

† అనుకృతి యనఁగా రూపకము.

నానాభావోప సంపన్నం నానావస్థాన్తరాత్మకమ్
* లోకవృత్తానుకరణం నాట్యమేతన్మయా కృతమ్
యోఽయం స్వభావోలోకస్య సుఖదుఃఖసమన్వితః
సోఽఙ్గాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే.

XIII.

ధర్మీయాద్వివిధాప్రోక్తా మయాపూర్వం ద్విజోత్తమాః
లౌకికీనాట్యధర్మీచ తయోర్వక్ష్యామి లక్షణమ్.
స్వభావ భావోపగతం శుద్ధం త్వవికృతంతథా
లోకవార్తాక్రియోపేతమఙ్గలీలా వివర్జితమ్.
† స్వభావాభినయోపేతం నానాస్త్రీపురుషాశ్రయమ్
యదీదృశం భవేన్నాట్యం లోకధర్మీతిసాస్మృతా.
యోఽయం స్వభావోలోకస్య సుఖదుఃఖక్రియాత్మకః
సోఽత్రాభినయ సంయుక్తో నాట్య ధర్మీప్రకీర్తితా.

విశ్వనాథకవిరాజు దృశ్యప్రబంధంబుల నిట్లు నిర్వచించినాఁడు:—

దృశ్యశ్రవ్యత్వ భేదేన పునఃకావ్యం ద్విధామతమ్.
దృశ్యంతత్రాభినేయంస్యా ద్రూపారోపాత్తురూపకమ్.
భవేదభినయోవస్థానుకార స్సచతుర్విధః
ఆఙ్గికోవాచికశ్చైవ మాహార్యస్సాత్త్వికస్తథా.

భరతుఁడు నిట్లు వచించినాఁడు.—

VI.

రసభావాహ్యభినయా ధర్మీవృత్తిప్రవృత్తయః
సిద్ధిస్స్వరా స్తథాతోద్యం గానం రఙ్గస్యసంగ్రహః.
ఆఙ్గికోవాచికశ్చైవ మాహార్యస్సాత్త్వికస్తథా
చత్వారోఽభినయాహ్యేతే యేషునాట్యం ప్రతిష్ఠితమ్.

* వృత్తాన్తానుకరణమ్మనలేదు కనుఁడు.
† అభినయమ్ము చతుర్విధము, ఆంగికవాచికాదులు.

"A play ought to be a just image of human nature." *Dryden.*

కాళిదాసుఁడు:—

దేవానామిదమామనన్తి మునయః కాన్తం క్రతుంచాక్షుషం
రుద్రేణేదముమాకృతవ్యతికరే స్వాఙ్గేవిభక్తంద్విధా
త్రైగుణ్యోద్భవ మత్రలోకచరితం నానారసందృశ్యతే
నాట్యంభిన్నరుచేర్జనస్యబహుధాప్యేకం సమారాధనమ్.

"త్రైగుణ్యోద్భవము" నాట్యము. తమోభూయిష్ఠులకు వాక్సంస్కార మరుదు గదా. ఇందువలన స్వభావానుకృతియే నాట్యమనియు, వినోదకరణమనియు, విశదముగదా. కావుననే కవిశిరోభూషణకారుఁడు 'తత్తత్స్వభావవర్ణనే' అని ఔచిత్యసమర్థకముగా స్వభావమునే చెప్పినాఁడు.

వేషవర్ణశ్మశ్రుక్రియాదికమునైతము తత్తత్స్వభావసిద్ధముగానుండవలయు నని భరతాచార్యుఁడు చెప్పియున్నాఁడు.

## XXI.

దేశజాతివిధానేన శేషాణామపి కారయేత్
వేషంతథాచాభరణం క్షురకర్మపరిచ్ఛదమ్.
అదేశయుక్తో వేషో హి నశోభాంజనయిష్యతి
మేఖలోరసిబద్ధేవ హాస్యంసముపపాదయేత్.
తథాప్రోషితకాన్తాసు మదనాభిహతాసుచ
వేషోవైమలినః కార్యః శిరశ్చాప్యేకవేణికమ్.
వర్తనాచ్ఛాదితంరూపం స్వవేషపరివర్తితమ్
నాట్యధర్మప్రవృత్తం తు జ్ఞేయం తత్ప్రకృతిస్థితమ్.
వర్ణానాంతువిధింజ్ఞాత్వా తథాప్రకృతిమేవచ
కుర్యాదఙ్గస్యరచనాం దేశజాతివయఃశ్రితామ్.
దేవాగౌరాస్తుకర్తవ్యా వర్ణేచాప్సరసస్తథా
రుద్రార్కద్రుహిణ స్కన్దాస్తపనీయ సమప్రభాః.

## గ్రామ్యము స్వభావసిద్ధము, శిష్టప్రయుక్తము.

దేశఁకర్మచజాతించ పృథివ్యుద్దేశసంశ్రయమ్
విజ్ఞాయవర్తనాకార్యా పురుషాణాంప్రయోగతః.
కిరాతబర్బరాన్ధ్రాశ్చ ద్రవిడాఃకాశికోసలాః
పుళిన్దాదాక్షిణాత్యాశ్చ ప్రాయేణత్వసితాః స్మృతాః
శకాశ్చయవనాశ్చైవ పాహ్లావాబాహ్లికాస్తథా
ప్రాయేణగౌరాః కర్తవ్యా ఉత్తరాం పశ్చిమాందిశమ్.
బ్రాహ్మణాః క్షత్త్రియాశ్చైవ గౌరాఃకార్యాస్తథైవచ.

ఇట్టి యల్పవిషయములయందే స్వభావమును ఇంతనిపుణముగా ననుకరింప వలసియుండఁగా కావ్యస్వరూప సర్వస్వమనఁదగినదై ప్రయోగాంగములందు ప్రధానమయిన వాక్కు స్వభావసిద్ధముగా నుండవలదను మతము సమ్మతమెట్లగును?

ఆంధ్రకవుల యీవక్ష్యమాణోదాహరణంబులం బరికింపుఁడు:—

క. అల్లదెకంటేపానపొన
తెల్లనిగట్టఉత మబ్బుదేరెడుపాలమం
దెల్లెడఁజూచిన ధరణీ
వల్లభ సీరాము సేన వాలుమెకంబుల్. మనుచరిత్ర.

ఇందలి సీ శబ్దము గ్రామ్యము. దీనిని తద్భవమని సాధింప వ్యస్తప్రయోగ మెచటనులేదు.

శా. ఓసామీయిటువంటికొండదరిలోనొంటింబులుల్సింగముల్
గాసింబెట్టెడుకుట్రనట్టడివిలోఁగల్జువ్విక్రీనీడనే
యాసంగట్టితివేటిగడ్డనిలునీవాఁకొన్నచోఁ గూడుసీ
ళ్లేసుట్టంబులుతెచ్చి పెట్టుదురునీకిందేటికోలింగమా. శ్రీకాళ.

మొక్కెముసామి.— రామాభ్యుదయము.
సూసినామేలుబాగెముసేసినాము — యయాతిచరిత్రము

ఉ. శేరువవాడపిల్లినరిశింహులుఃతీరతమోయిబోగమ
మ్మోరులయాటసూస్తిఃరిముంగలదేముడదెంతయిద్దిలో

తీసుప చూసగంటి మరితి త్తినిగుక్కిఁడకూడువోడికా
లూని కెమొక్కఁబుద్ధవునహోయనుమూర్ఖుఁడుచంద్రశేఖరా.

షట్చక్రవర్తి చరిత్రమున నెంత గ్రామ్యమున్నదో కని యెఱుంగుఁడు.

గ్రామ్యముచ్చరింపరానిచో—"పుల్చు" కథ యెట్లు చెప్పఁగలము? నీచుఁడు తిట్టిన దుర్భాషలను న్యాయస్థానమందుఁ దెలిపి యెట్లు వానికి దండన సేయిఁతుముఁ? ప్రసక్తివచ్చినచో బాలమత్తాది భాషితములను యథాస్థితముగా నెట్లు తెల్పుదుము?

శిశువు-నానా, తప్పూదాదు. ఓయిబాబో గోయిందగోయింద ఎంతసీలోయి!

పిపిప్రియ ససస్వయం ముముముఖాసవం దేహి మే
తతత్యజ దదుద్రుతం భభభభాజనం కాఞ్చనమ్।
ఇతిస్ఖలితజల్పితం మదవశాత్కురఙ్గీదృశః
ప్రగేహసితహేతవేసహచరీభిరధ్యైయత॥ సరస్వతీకంఠాభరణధృ [తము.

పిపిప్రియేత్యాదులు అపశబ్దము లేగదా.

"అనిదంప్రథమాశ్శబ్దాః సాధవఃపరికీర్తితాః
తఏవశక్తివైకల్య ప్రమాదాలసతాదిభిః
అన్యథోచ్చారితాఃపుమ్భి రపశబ్దాఇతీరితా." హరి.

"హసితహేతవే" అనుపలుకుం దిలకింపుఁడు

ఉదాహరణార్థము. 'అద్దా చెప్తాగ' 'చంపేసి' అని ప్రయోగించిన పూర్వ పక్షవాదులకు తత్ప్రయోగప్రయుక్తమైన ప్రత్యవాయ మెట్లు తప్పును? ఆ గ్రామ్యము లేక వారికిని ఈవాదవ్యవహారము నిరూఢము కాలేదు గదా? అప్పకవి చెప్పిన "వ్యవహారహాని" యనుమాట నిట ననుసంధానము చేయుఁడు

సంస్కృతరూపకముల ప్రాకృతము సంస్కృతగ్రామ్యమే కదా.

భరతముని, XVII.

ఏవన్తుసంస్కృతంపాఠ్యం మయాప్రోక్తంసమాసతః
ప్రాకృతస్యతుపాఠ్యస్య సంప్రవక్ష్యామిలక్షణమ్
ఏతదేవవిపర్యస్తం సంస్కారగుణవర్జితమ్
విజ్ఞేయంప్రాకృతంపాఠ్యం నానావస్థాన్తరాత్మకమ్

[సంస్కారగుణవర్జిత మ్మనుటయె గ్రామ్యమనుట. "సంస్కారార్థో నియమోఽనియమాద్గ్రామ్యం హియత్త్వపభ్రంశః" అని నన్నయ.]

త్రివిధంతచ్చవిజ్ఞేయం నాట్యయోగే సమాసతః
సమానశబ్దంవిభ్రష్టం దేశీమతమథాపివా.
కమలామలరేణుతరఙ్గలోల సలిలాదివాక్యసంపన్నమ్
ప్రాకృతబన్ధేష్వేవం సంస్కృతమపియోగముపయాతి.
యేవర్ణాస్సంయుక్తా స్స్వరవర్ణాన్తనుతాంచాపి
గచ్ఛన్తిపదన్యస్తా స్తే విభ్రష్టా ఇతిజ్ఞేయాః.

ఇటువెంబడి కొన్ని ప్రాకృతశబ్దములును కొన్ని వర్ణవిపర్యాస సూత్రములును చెప్పఁబడియున్నవి. అందువలన, ప్రాకృతమున కప్పటికి లక్షణములు లేనట్లు ఊహనీయమైయున్నది. ఇందువలన, 'ప్రాకృతాదులు సలక్షణభాషలుగాన ప్రయోగింపఁబడినవి' అనువాద మపాస్తము.

ఏవమేతత్తువిజ్ఞేయం ప్రాకృతంసంస్కృతంతథా
అతఊర్ధ్వంప్రవక్ష్యామి దేశభాషావికల్పనమ్.
భాషాచతుర్విధాజ్ఞేయా దశరూపేప్రయోగతః
సంస్కృతంప్రాకృతంచైవ యత్రపాఠ్యంప్రయుజ్యతే.
అతిభాషార్థభాషాచ జాతిభాషాతథైవచ
తథాజాత్యన్తరీచైవ భాషానాట్యేప్రకీర్తితా.
అభిభాషాతుదేవానా మార్యభాషాతుభూభుజామ్

సంస్కారపాఠ్యసంయుక్తా సమ్యగ్గ్రామప్రతిష్ఠితా.
వివిధాజాతిభాషాచ ప్రయోగేసముదాహృతా
మ్లేచ్ఛశబ్దోపచారాచ భారతంవర్ష మాశ్రితమ్.

వారివారి గ్రామ్యము ప్రయోగింపవలసినదని భావము

ఏలయింతప్రయాస, సంస్కృతమాత్రమునం దనియరాదా,యనిన,--

యోంథజాత్యన్తరీభాషా గ్రామారణ్యపశూద్భవా
నానావిహఙ్గజాచైవ నాట్యధర్మీప్రయోగజా.

పశువిహంగభాషలుకూడ గ్రాహ్యములంట, మనుష్యులగ్రామ్యము గ్రాహ్యముకాకుండునా?

జాతిభాషాశ్రయంపాఠ్యం ద్వివిధంసముదాహృతం
ప్రాకృతంసంస్కృతంచైవ చాతుర్వర్ణ్యసమాశ్రయమ్.
ధీరోద్ధతేధీరలలితే ధీరోదాత్తేతథైవచ
ధీరప్రశాన్తేచతథాపాఠ్యం యోజ్యన్తుసంస్కృతమ్.
ఏషామేవతుసర్వేషాం నాట్యకానాంప్రయోగజమ్
కరైరవ్యపదేశేన ప్రాకృతం తుప్రయోజయేత్.
ఐశ్వర్యేణప్రమత్తస్య ఐశ్వర్యేణప్లుతస్యచ
దారిద్ర్యేణప్రమత్తస్య దారిద్ర్యేణప్లుతస్యచ
ఉత్తమస్యాపిబ్రువతః ప్రాకృతంసంప్రయోజయేత్.
వ్యాజలిఙ్గప్రతిష్ఠానాం శ్రమణానాంతపస్వినామ్
భిక్షుచక్రచరణానాం ప్రాకృతంసంప్రయోజయేత్.
బాలేగదోపసృష్టేచ స్త్రీణాంచప్రకృతౌతథా
నీచేమత్తేసలిఙ్గేచ ప్రాకృతంపాఠ్యమిష్యతే.
పరివ్రాణ్మునిశాక్యేషు వాక్యేషుశ్రోత్రియేషుచ
ద్విజాయేచైవ లిఙ్గస్థాః సంస్కృతం తేషుయోజయేత్
రాజ్ఞశ్చగణికాయాశ్చ శిల్పకార్యాస్తథైవచ

కాలావస్థాన్తరకృతం యోజ్యంపాఠ్యంతుసంస్కృతమ్.
నృపపత్న్యాశ్చ వేశ్యాయాః పాఠ్యం సంస్కృతంద్విజసత్తమాః.
క్రీడార్థంసర్వలోకస్య ప్రయోగస్యసుఖాశ్రయమ్.
కలాభ్యాసాశ్రయంచైవ పాఠ్యం వేశ్యాసుసంస్కృతమ్.
కాలోపచారజ్ఞానార్థం క్రీడార్థంపార్థివస్యతు
నిర్దిష్టంశిల్ప కార్యాస్తు నాటకేసంస్కృతంవచః.

ఇట్లు వేశ్యాశిల్పకారికలకు ఔచిత్యముచేతనే సంస్కృతము పెట్టితిమని భరతమహాముని దండోరా వేయుచుండఁగా, "స్త్రీశూద్రాదులు సంస్కృత ముచ్చరింపరాని హేతువుచే వారికి ప్రాకృతము పెట్టఁబడినది" అనుట సరిగాదు

ఆమ్నాయసిద్ధంసర్వాసాం శుభమప్సరసాంభవః
సంసర్గాద్దేవతానాంవై తద్ధిలోకోఽనువర్తతే.
ఛన్దతః ప్రాకృతంపాఠ్యం స్మృతమప్సరసాంభువి
మానుషీణాన్తుకర్తవ్యం కారణార్థవ్యపేక్షయా.
నబర్బరకిరాతాన్ధ్ర ద్రవిడాద్యాసుజాతిషు
నాట్యయోగేతుకర్తవ్యం కావ్యంభాషాసమాశ్రయమ్.
జాతిష్వేతాసుసర్వాసు శుద్ధాసుచద్విజోత్తమాః
శౌరసేనీంసమాశ్రిత్య భాషాకార్యాతునాటకే.
అథవాఛన్దతఃకార్యా దేశభాషాప్రయోక్తృభిః.

దీనివలన మ్లేచ్ఛాదులభాషలు ప్రసక్తించినపుడు వానిని సాక్షాత్తుగా ప్రయోగింపరాదనియు, మనగ్రామ్యమునే మార్పులొనర్చి వారి భాషవలె చేయవలయుననియు, నెఱుంగనగునుగదా. ఆంధ్రమందు అట్లు ప్రసక్తించినపుడు మన పెద్దలు అన్యభాషా శబ్దోపచారముగా రచించియున్నారు. శ్రీకాళహస్తి మహాత్మ్యములో ధూర్జటి:—.

సీ. బిజమాడు దేవరని జక్కృపామహిమఁజె న్నారునాయిల్లుబిడారునీకు
నాకునీపాదార్చనము సేయనడలింగ మూర్తినేకు రెవచ్చిమూర్తమాడి
యొడయచిత్తేశనాఁయునికినీమజ్జన మాడుశివార్చనమాడ జేకు
విచ్చేయుఁడిడఁబూవెనీడియం బందుకో జంగమస్వామినాసవనమునకు

గీ నోగిరఁబులుమంచిమ్మేలోగిరమున
నావంటిచెవఁబడఁడుమీారారగింపఁ
బ్రతిదినంబునుజంగమార్చనములేక
తనువువడనొల్లరూపకందర్పయనఁగ.

అప్పకవి—

క. నీతంబని దేశీయము
జాతీయంబును వచించు సమయమున నిజ
త్మాతల భాషాకృతులను
ఖ్యాతిగ మ్లేచ్ఛోక్తులాదిగాఁ గూర్తురజా.

క. క్షితి మ్లేచ్ఛభాష శ్రుతిగ
ర్హితమగు నట్లయిన నీధరిత్రినిదానిన్
మతిరోసి విడువఁగూడదు
సతతము వ్యవహారహాని సంధిలుకతనన్.—

అని సూత్రించి పై "బిజమాడు" సీసమునే యుదాహరించినాఁడు.

ఏలయింత ప్రయాస, ఇన్నిభాషల రచింపనేల, భేదములను జ్ఞప్తి యుంచుకొని రచించుట కడుం బ్రయాసముగాదా, ఏల కవుల నిట్లువేఁపుట? యనిన:—

నానాదేశసముత్థం హి కావ్యంభవతినాటకే.
మాగధ్యవన్తిజాప్రాచ్యా శూరసేన్యర్ధమాగధీ
బాహ్లీకీదాక్షిణాత్యాచ సప్త భాషాఃప్రకీర్తితాః.
మాగధీతునరేన్ద్రాణా మన్తఃపురనివాసినామ్

చేటానాంరాజపుత్త్రాణాం శ్రేష్ఠినాంచార్ధమాగధీ
ప్రాచ్యావిదూషకాదీనాం ధూర్తానామప్యవన్తిజా
నాయికానాంసఖీనాంచ శూరసేనావిరోధినీ.
యోధ నాగరకాదీనాం దాక్షిణాత్యాథదీవ్యతామ్
బాహ్లీకభాషోదీచ్యానాం ఖసానాంచస్వదేశజా.
శబరాణాంశకాదీనాం తత్స్వభావశ్చయోగణః
శకారభాషాయోక్తవ్యా చణ్డాలీపుల్కసాదిషు.
అఙ్గారకారవ్యాధానాం కాష్ఠయన్త్రోపజీవినామ్
యోజ్యాశబరభాషాతు కించిద్వానౌకసీతథా.
గవాశ్వాజావిరోష్ట్రాదిఘోషస్థాననివాసినామ్
ఆభీరోక్తిఃశాబరీ వా ద్రావిడీద్రవిడాదిషు
సురఙ్గాఖనకాదీనాం సౌణ్డీకారాగ్రరక్షిణామ్
వ్యసనేనాయకానాంస్యా దాత్మరక్షాను మాగధీ.
నబర్బరకిరాతాన్ధ్ర ద్రవిడాద్యాసుజాతిషు
నాట్యప్రయోగేకర్తవ్యం కావ్యంభాషాసమాశ్రయమ్.

చెంచులు, గొల్లలు, చండాలురు, ఆటవికులు, సిపాయులు, జూదరులు,బొగ్గుచేయువారు,వేటకాండ్రు, గుఱ్ఱపువాండ్రు,ఒంటెలవాండ్రు, ఉప్పరలు —ఇట్టివారికి వారివారిభాషలు ప్రయోగింపుమని యిటనాదేశము. ఇట్టి విభాషాభేదములను సయితము మహర్షి యెంతయక్కఱతో నుపదేశించినాఁడో యరయుఁడు. ఈభాషయందుమాత్రము జాతిభేదములకు విభాషాభేదములు అక్కఱలేదా? అన్నిటికినివ్యాకృతమే పెట్టినచో భేదము లలవడునా ? అజ్ఞాతములైన దూరదేశభాషలవలె శౌరసేనిని మార్చుకొనుప్రకారములరయుఁడు. అట్లే మనము మ్లేచ్ఛాదిభాషలవలె మనగ్రామ్యమునే ప్రసక్తింబట్టి మార్చుకొనవలయును.

గఙ్గాసాగరమధ్యేతు యేదేశాస్సంప్రకీర్తితాః
ఏకారబహుళాంతేషు భాషాంతజ్ఞఃప్రయోజయేత్.

విన్ధ్యసాగరమధ్యేతు యేదేశాస్సృతిమాగతాః
నకారబహుళాం తేషు భాషాం తజ్జ్ఞః ప్రయోజయేత్.

సురాష్ట్రావన్తిదేశేషు వేత్రవత్యుత్తరేషుచ
యేదేశాస్తేషుకుర్వీత చకారబహుళామిహ.
హిమవత్సిన్ధుసౌవీరా న్యేచదేశాస్సమాశ్రితాః
ఉకారబహుళాం తజ్జ్ఞ స్తేషుభాషాంప్రయోజయేత్.

చర్మణ్వతీనదీపారే యేచార్బుదసమాశ్రితాః
తకారబహుళాంనిత్యం తేషుభాషాంప్రయోజయేత్.
ఏవంభాషావిధానన్తు కర్తవ్యంనాటకాశ్రయమ్
అత్రనోక్తంమయాయచ్చ లోకాద్గ్రాహ్యంబుధైస్తుతత్.

"లోకాద్గ్రాహ్యమ్"—లక్షణాత్, వ్యాకరణాత్, అనలేదుగదా! ఇందువలన బర్బరాదిభిన్నములైన యీ దేశభాషలెల్ల గ్రామ్యములనియు, లక్షణహీనములనియు, వీనిని చక్కఁగ నెఱింగినవారు అట్లే ప్రయోగింపవలయుననియు, ఎఱుంగనివారు శౌరసేనిని ఉక్తప్రకారమున మార్చుకోవలయుననియు, నాదేశము. ఈమర్యాదచే, ఆంధ్రరూపకములయందును గ్రామ్యభేదములం బ్రయోగించుట యావశ్యకమనియు, అందులకు లోకమే ప్రమాణముగాని లక్షణగ్రంథము లనావశ్యకములనియు, జాత్యాదిభేదములను గ్రామ్యభాషాభేదములచే నిర్వహించుట యత్యంతావశ్యక మనియు, స్పష్టముగదా.

అగుఁగాక:—ప్రతిషేధవచనములకు అవకాశ మెక్కడ? కలవుగదా పెక్కులు ప్రతిషేధోక్తులు, ఈ క్రింది వికృతివివేకకారికలం గనుఁడు,—

తదల్పమపినోపేక్ష్యం కావ్యేదుష్టంకథంచన
స్యాద్వపుస్సున్దరమపి శ్విత్రేణైకేనదుర్భగమ్.
గౌర్గాః కామదుఘాసమ్య క్ప్రయుక్తాస్మర్యతేబుధైః
దుష్ప్రయుక్తాపునర్గోత్వం ప్రయోక్తుస్సైవశంసతి.

శ్రుతేఽపశబ్దేప్రోక్తేవా ప్రమాదాత్పాణినింస్మరేత్
అథవాఫణినామీశం చిన్తయేచ్ఛ్వహాంశోబుధః.
ప్రాకృతేషడ్విధేచాపి వాల్మీకింవామహేశ్వరమ్
ధ్యాయేదత్రతుమామేవ స్మరేత్పణ్డితసమ్మతః.
సన్మూలత్వాచ్చరూఢత్వాద్గృహీతత్వాచ్చసాధుభిః
నాపభ్రంశత్వమేతస్యా నియమాభావతస్తుతత్.
నివారణాయతస్యైవ ప్రవృత్తిర్విదుషామభూత్
కవిత్వోపాశ్రితందోషం నైవకించిత్సహామహే.
కామంసర్వోప్యలంకారో రసమర్థేనిషిఞ్చతు
తథాప్యగ్రామ్యతైవైనం భారంవహతిభూయసా —

అని మదీయ ప్రతిపక్షవాదులు దృశ్యప్రబంధ నీచపాత్ర గ్రామ్య ప్రతిషేధపరముగా నీపాట మాటిమాటికిం బాడుచున్నారు

ఇది యుపక్రమ పూర్వకముగా నీచపాత్రములకు ప్రయుక్తమైన గ్రామ్యమునకు ప్రతిషేధకముగాదు. "ప్రమాదాత్త" ని యున్నది కనుక. ఇది ప్రమాదముచే ఉపక్రమహీనముగా ప్రయోగించు నపశబ్దములకు ప్రతిషేధము.

"అగ్రామ్యతైవైనంభారంవహతి" యన్నచో గ్రామ్యమనఁగా నపశబ్దమని పూర్వపక్షులు భ్రమపడిరి. దీనితర్వాతి గ్రంథముం గనుఁడు.

*కన్యే కామయమానంమాం త్వంన కామయసేకథమ్
ఇతిగ్రామ్యోఽయమర్థాత్మా వైరస్యాయైవకల్పతే.
కామంకన్దర్పచణ్డాలో మయి వామాక్షి నిర్దయః
త్వయినిర్మత్సరోదిష్ట్యే త్యగ్రామ్యోర్థోరసావహః.
శబ్దేపిగ్రామ్యతాస్త్యేవ సాసభ్యేతరకీర్తనాత్

* చుమ్బనం దేహి మే భార్యే కామచణ్డాలతృప్తయే" అని రసగంగాధరమం దుదాహరణము.

యథా * యకారాదిపదం రత్యుత్సవనిరూపణే.
పదబన్ధానువృత్త్యావా వాక్యార్థ త్వేనవాపునః
దుష్ప్రతీతికరం గ్రామ్యం యథాయాభవతః ప్రియా
ఖరంప్రహృత్యవిక్రాన్తః పురుషోవీర్యవానితి
ఏవమాదినిశంసన్తి మార్గయోరుభయోరపి.
భగినీభగవత్యాది సర్వత్రైవానుగమ్యతే
పామరాదిప్రయుక్తం య త్తద్గ్రామ్యమభిధీయతే.

ఈ "కామసర్వోప్యా" దిప్రబంధ మెచటనుండి యథర్వణాచార్యుడు తెచ్చికొనెనో ఆ దండిప్రణీత కావ్యాదర్శమున గనుడు దీనియర్థ మచ్చటివ్యాఖ్యలచే స్పష్టమగును. దీనికిని "గ్రామ్యం తత్త ద్విధా సాధు" అను నను శాసనమునకును ఉత్సర్గాపవాద న్యాయకల్పనము సాధువుగాదు "తత్తద్విధా" అనుటచే సోపక్రమమునకు అనుశాసనము, "ప్రమాదాత్" అనుటచే నిరుపక్రమమునకునిషేధము, అని సిద్ధాంతము. పూర్వపక్షుల నిషేధప్రమాణాభాసములు సమాప్తప్రాయములే. అనుపక్రమస్థలమందు పెద్దల నిషేధవచనముల నేను చెప్పెదను వినుడు.

మహాభాష్యమందు—

తేఽసురాః హేలయో హేలయ ఇతి కుర్వన్తః పరాబభూవుస్తస్మా ద్బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవై నాపభాషితవై। మ్లేచ్ఛోహవా ఏష యదపశబ్దః। మ్లేచ్ఛామాభూమేత్యధ్యేయం వ్యాకరణమ్॥

ఏకైకస్యశబ్దస్యబహవోఽపభ్రంశాః।తద్యథాగౌరిత్యస్య గావీగోణీగోతాగోపోతలికే త్యేవమాదయోఽపభ్రంశాః॥

సమానేచార్థేశాస్త్రాన్వి తోఽశాస్త్రాన్వితస్య నివర్తకోభవతి। తద్యథా। దేవదత్తశబ్దో దేవదిణ్ణశబ్దం నివర్తయతి న గావ్యాదీన్॥—

* ఇది "పీకుట" వంటిది.

వీనివలన ప్రాకృతభాష నెఱింగినవారికి ఇట ప్రాకృతశబ్దములే అపభ్రంశములుగా గ్రామ్యములుగా ప్రయోగానర్హములుగా తెల్పఁబడినవని విశదమగును.

"గ్రామ్యంహియ<u>త్త్వపభ్రంశః</u>"
"శాస్త్రేతుసంస్కృతాదన్య<u>దపభ్రంశత</u>యోదితమ్"

కానసే భోజరాజు ప్రాకృతాది ప్రయోగావసరమందు సమాధానముఁగా అమ్లేచ్ఛితవ్యవ్యవస్థను చెప్పినాఁడు. భాష్యమందట్లు ప్రత్యవాయజనకములుగా నపభ్రంశములుగా పేర్కొనంబడిన యాప్రాకృతములనే సుఁడీ నిషేధగ్రహయాళువులు సలక్షణములనియు సలక్షణత్వకారణముచే దృశ్యప్రబంధములఁ బ్రయుక్తములాయెననియు వాదించుచున్నారు. ప్రతిషేధమునకు విషయము మహాభాష్యముననే చెప్పఁబడియున్నది.—

యదప్యుచ్యతేఆచారేనియమఇతి । యాజ్ఞేకర్మణిసనియమః । ఏవంహి శ్రూయతే । యర్వాణ స్తర్వాణోనామ ఋషయోబభూవుః । ప్రత్యక్షధర్మాణః పరావరజ్ఞాః విదితవేదితవ్యాః అధిగతయాథాతథ్యాః। తే తత్రభవన్తోయద్వాన స్తద్వాన ఇతిప్రయోక్తవ్యేయర్వా ణ స్తర్వాణ ఇతి ప్రయుఞ్జతే । యాజ్ఞేకర్మణిపునర్నాపభాషన్తే । తైఃపునరసురైర్యాజ్ఞేకర్మణ్యపభాషితం తతస్తేపరాభూతాః॥—

యాజ్ఞకర్మయందు ప్రతిషేధము. భోజరాజు మతాంతరసంకలనార్థము "నమ్లేచ్ఛితవ్యంయజ్ఞాదౌ" అని ఆది శబ్దముంబెట్టినాఁడు.

శబ్దకౌస్తుభమందు—

యాజ్ఞికాఃపఠన్తి । ఆహితాగ్నిరపశబ్దం ప్రయుజ్యప్రాయశ్చిత్తీయాంసారస్వతీమిష్టింనిర్వపేదితి॥—

ప్ర॥ అట్లేని, ప్రబంధములందు ఉపక్రమహీనముగా గ్రామ్యము పెట్టవచ్చునా?

ఉ॥ పెట్టఁగూడదని "ప్రమాదాత్" అనుచోటనే తెల్పినాఁడుఁగదా. ఆదిశబ్దముచే భోజరాజుకూడ కూడదని తెల్పినాఁడు.

ప్ర॥ అశ్లీలని, తత్తజ్జాతి స్వభావ వర్ణనమందు పెట్టుట విరుద్ధము కాదా?

ఉ॥ కాదు అనుకరణప్రభావముచేత నది సురక్షితము.

"అదుష్టతానుకరణేతుసర్వేషామ్।
వక్త్రాద్యౌచిత్యవశాద్దోషోపిగుణఃక్వచిత్॥" మమ్మటుఁడు.

"వక్త్రాద్యౌచిత్యవశాత్త"ను మాటను మఱచకుఁడు
"అనుకారేతుసర్వేషాం దోషాణాంనైవదోషతా." విశ్వనాథకవిరాజు.

రుద్రటకారిక సవ్యాఖ్యావతారిక.—

అథ సర్వేషామేవ శబ్దదోషాణాం విషయవిశేషే సాధుత్వం దర్శయితుమాహ:—

అనుకరణభావమవికల । మసమర్థాదిస్వరూపతోఁగచ్ఛత్।
నభవతిదుష్టమతావ్య । ద్విపరీతక్లిష్టవర్ణంచ॥

అసమర్థాదిదోషై ర్దుష్టమపిపదంవాక్యం వా పరిపూర్ణం స్వరూపతోఽనుక్రియమాణం దోషాయనభవతి । యథావికటనితమ్బాయాః పతిమనుకుర్వాణా సఖీప్రాహ:—

కాలేమాషంసస్యేమాసం । వదతిశకాశంయశ్చసకాశమ్।
ఉష్ట్రేలుమ్పతిరంవాషంవా । తస్మైదత్తావికటనితమ్బా॥

శబ్దకౌస్తుభమందు—

అథసాధుత్వాదసాధుతేత్యాగ్రహ స్తథాపినయుక్తిః । శబ్దస్వరూపపరత్వాత్।అనుకరణానాం సర్వత్రసాధుతాభ్యుపగమాత్ । నహి హేలయో హేలయ ఇతిశ్రుతిపాఠోపి ప్రత్యవాయజనకః।శబ్దస్వరూపమాత్రపరా ఏతే భిన్నా ఏవసాధవశ్చేతితుల్యమ్॥ ...అనుకరణానామనుకార్యేణార్థవతాం సర్వత్ర సాధుతాభ్యుపగమాత్.

వార్తికము:

అనుకరణం హి శిష్టాశిష్టాప్రతిషిద్ధేషు యథా లౌకిక వైదికేషు.

భాష్యము.

అనుకరణం హిశిష్టస్య సాధుభవతి; అశిష్టాప్రతిషిద్ధస్య వానైవ తద్దోషాయ భవతి నాభ్యుదయాయ । యథాలౌకికవైదికేషు। యథాలౌకికేషువైదికేషుచ కృతాన్తేషు । లోకేతావత్ । య ఏవమసౌదదాతి య ఏవమసౌయజతే య ఏవ మసావధీత ఇతితస్యానుకుర్వన్ దద్యాచ్చ యజేత చాధీయీతచ సోఽప్యభ్యుదయేన యుజ్యతే । వేదేపి య ఏవం విశ్వసృజస్సత్రాణ్యధ్యాసత ఇతి తేషామనుకుర్వన్ తద్వత్సత్రాణ్యధ్యాసీత సోఽప్యభ్యుదయేనయుజ్యతే । అశిష్టాప్రతిషిద్ధంయథా । య ఏవ మసౌ హిక్కతి య ఏవమసౌ హసతి య ఏవమసౌకణ్డూయతీతి తస్యానుకుర్వన్ హిక్కేచ్చహసేచ్చ కణ్డూయేచ్చ నైవతద్దోషాయస్యాన్నాభ్యుదయాయ। యస్త్వేవమసౌ బ్రాహ్మణంహన్తియ ఏమసౌ సురాంపిబతీతి తస్యానుకుర్వన్ బ్రాహ్మణం హన్యాత్ సురాంవాపిబేత్ సోపిమన్యేపతితస్స్యాత్॥విషమ ఉపన్యాసః॥యశ్చైవంహన్తి యశ్చానుహన్తి ఉభౌతౌహతః। యశ్చాపిపిబతి యశ్చానుపిబతి ఉభౌతౌపిబతః।యస్త్వేవమసౌ బ్రాహ్మణంహన్తి ఏవ మసౌ సురాం వా పిబతీతి తస్యానుకుర్వన్ స్నాతానులిప్తో మాల్యగుణకణ్ఠః కదలీస్తమ్భంఛిన్ద్యాత్ పయోవాపిబేత్ నసమన్యేపతితఃస్యాత్ । ఏవమిహాపి య ఏవమసావపశబ్దం ప్రయుఙ్క్తే ఇతి తస్యానుకుర్వన్నపశబ్దం ప్రయుఞ్జీత సోఽప్యపశబ్దభాక్స్యాత్ । అయంత్వన్యోఽపశబ్ద పదార్థకః శబ్దో యదర్థ ఉపదేశఃకర్తవ్యః । నచాపశబ్దపదార్థకః శబ్దోఽపశబ్దోభవతి।అవశ్యం చైతదేవంవిజ్ఞేయమ్ । యోహిమన్యతేఽపశబ్దపదార్థకః శబ్దోఽపశబ్దోభవతీతి అపశబ్దఇత్యేవ తస్యాపశబ్దస్స్యాత్ । నచైషోపశబ్దః ॥

ఇందులకు శబ్దకౌస్తుభము—

యత్తు ద్వితీయప్రయోజన నిరాకరణార్థం వార్తికమ్ । అనుకర

ణంహీశిష్టాశిష్టాప్రతిషిద్ధేష్వితి । తస్యాయమర్థః । శిష్టస్యసాధోరనుకరణంసాధ్వేవ । అశిష్టంచతదప్రతిషిద్ధంచ సాధ్వసాధుబహిర్భూతం టిఘుభాది తస్యానుకరణ మప్యసాధ్వేవేతి। ఇదంతుభాష్యేదూషితమేవ। హేలయో హేలయఇత్యాదీనాం శిష్టపరిగృహీతానా మసాధుతాయాం బీజాభావాత్। నహ్యపశబ్దవాచకత్వమాత్రేణ తథాత్వమ్। అపశబ్ద ఇత్యస్యాప్యసాధుతాపత్తేః । నచప్రకృతివదనుకరణమి త్యనేనాసాధుతాతిదేశః। అశాస్త్రీయస్యాతిదేశాయోగాదితిదిక్ । తస్మా ద్వార్తికకృతా దూషితమపి ద్వితీయప్రయోజనం భాష్యరీత్యాస్థితమ్॥—

భరతమహర్షి మదానుకృతినిట్లు చెప్పుచున్నాఁడు

## VII.

త్రివిధస్తుమదఃకార్య స్తరుణోమధ్య స్తథావకృష్టశ్చ
కరణంపఞ్చవిధంస్యా త్తస్యాభినయఃప్రయోక్తవ్యః.
కశ్చిన్మత్తోగాయతి రోదితికశ్చి త్తథాహసతికశ్చిత్
పరుషవచనాభిధాయీ కశ్చి త్క శ్చిత్తథాస్వపితి.
ఉత్తమసత్త్వశ్చైతే హసతిచగాయతిచమధ్యమప్రకృతిః
పరుషవచనాభిధాయీ రోదిత్యపిచాధమప్రకృతిః.
రఙ్గేపిబతఃకార్యా మదవృద్ధి ర్నాట్యయోగమాసాద్య।
కార్యోమదక్షయోవై యః ఖలుపీత్వాప్రవిష్టస్స్యాత్ ॥

సురాపానానుకరణము స్వర్గమిచ్చునఁట! అపశబ్దానుకరణము నరకమునంగూల్చునఁట ! అనుకరణము కూల్పదు.

భూరిభారభరాక్రాన్తః స్కన్ధో బాధతి కింతవ ।
నచైష బాధతే స్కన్ధ స్తవ బాధతి బాధతే ॥

ఇందు తొలి "బాధతి" యేగదా పరిహసింపఁబడుచున్నది, ప్రత్యవాయ జనకంబు నగుచున్నది.

## ప్రాకృతములు గ్రామ్యములన మఱికొన్ని ప్రమాణములు

### కథాసరిత్సాగరము.

వాక్యమణోరుపాతత్ర పఞ్జరస్థైశ్శుకైరపి

ప్రవిశ్యసదదర్శాన్త ర్దేవీంతామ్మన్యుపీడితామ్.

వామహస్తతలన్యస్త విషణ్ణవదనామ్బుజామ్

స్వచ్ఛముక్తాఫలనిభైః పతద్భిర్బాష్పబిన్దుభిః

"జఇవిరహోణసహిజ్జఇ మాణోపరివజ్జఃణీఓ తే

విరహోహిఅఇసహిజ్జఇ మాణోపరివడ్ఢణీఓ తే

ఇఅజాణిఊణనిఉణం చిట్ఠసు ఓలమ్బిఊణఇక్కదరమ్

ఉహఅతడదిణ్ణపాఓ మజ్ఝణివడిఓధువంవిణిస్సిహిసి"

ఇతీమంద్విపదీఖణ్డం పఠన్తీంసాశ్రుగద్గదమ్

నిర్వ్యద్ధస్తాంశుహారిణ్యా గిరాపభ్రంశముగ్ధయా

విలోక్యతాంతథాభూతాం కోపేపిచమనోరమాం

ఉపాయయాసలజ్జశ్చ సభయశ్చసభూపతిః

ఇట మహారాష్ట్రీభాషను అనఁగా ఉత్తమప్రాకృతమును అపభ్రంశమని వ్యవహరించియున్నారు, కనుండు.

"ప్రాకృత—నాటకాదౌ ప్రసిద్ధే అపభ్రంశశబ్దభేదే, ప్రాకృతభాషాయాస్సంస్కృతశబ్ద ప్రకృతికత్వాత్ తథాత్వమ్" అని బృహదభిధానము. 'అపభ్రంశో పశబ్దస్స్యాత్' అమరుఁడు. 'సంస్కృతాదపభ్రశ్యతి' అనిరామాశ్రమి. "శాస్త్రేతుసంస్కృతాదన్య దపభ్రంశతయోదితమ్" అని దండి. "సంస్కారార్థోనియమోఽ నియమాద్గ్రామ్యం హి యస్త్వపభ్రంశః" అని నన్నయ.

## WEBER.

"The more the language of the *grammatically educated* gained on the one hand in purity, and in being purged of every thing not strictly regular, the more foreign did it become on the other hand

to the usage of the majority of the people who were *without grammatical training*. In this way a *refined language* gradually disconnected itself from the *vernaculars*, as more and more the *exclusive property of the higher classes of the people*: the estrangement between the two growing more and more marked, as the popular dialect in its turn underwent further development. This took place mainly under the influence of those aboriginal inhabitants who have been received into the Brahmanical community; who it is true little by little exchanged their own language for that of their conquerors, but not without importing into the latter a large number of new words and of phonetic changes and in particular very materially modifying the prenunciation. This last was all the more necessary, as the numerous accumulations of consonants in the Aryan Bhasha presented exceeding difficulties to the natives; and it was all easier, as there had evidently prevailed within the language itself from an early period, a tendency to clear away these troublesome encumbrances of speech, a tendency to which, indeed *the study of Grammar* imposed a limit so far as the educated portion of the Aryans was concerned, but which certainly maintained itself and by the very nature of the case continued to spread amongst the people at large."

దీనివలన ప్రాకృతము సంస్కృతగ్రామ్యమని విశదము.

మోనియర్ విల్లియమ్సు (Monier Williams)గారు తమ యింగ్లశాకుంతలావతారికయందు ప్రాకృతభాషలను 'Colloquial Sanskrit' అని వ్యవహరించిరి. 'Colloquial' అనఁగా నేమో బ్రౌనుదొరగారు తమ నిఘంటువులో నిట్లు తెల్పినారు:—Colloquial, adj. సామాన్యమైన, గ్రామ్యమైన;—language రూఢిగావుండేమాటలు, గ్రామ్యభాష, సామాన్యభాష, అనఁగా కావ్యమందు రాని భాష

శంకరపాండురంగ పండితులవారు ఎమ్. ఏ. 'గౌడవహము' అను ప్రాకృతకావ్యము నవతారికయందిట్లు వ్రాసినారు —

"The latter [Prakrit Poets] ... ... ... ... had necessarily to study their matter more carefully in order to make up

thereby the deficiencies and the disadvantages attendant upon the use of the *Vulgar Tongues*."

ఇందు "Vulgar tongues" అనుమాటను మఱవకుఁడీ.

ఆగ్రంథమందే మఱల:—

"When we are on this subject we must not forget that only a few of the dialects in which the Prakrit of the ancient days existed, have been *cultivated by being written in by some celebrated poets or authors* and thereby brought to the front, while others which existed side by side with them have been neglected and allowed to die away."

"Cultivated" అనుటచేతను, 'Vulgar tougues' అనుటచేతను ప్రాకృతముల గ్రామ్యత్వము లక్షణహీనత్వమును విశదములు

దత్తగారు (Dutt.)—

"This then is a sufficiently clear and definite fact, which is invaluable to the historian of India. We know the *spoken tongue of the Vedic age*, which has been preserved in the simplest and most beautiful hymns of the Rig Veda. We know the spoken tongue of the Epic Age, which has been preserved in the prose Brahmanas and Aranyakas. After 800 B. C., there was a growing *divergence between the spoken and the written tongue*. Learned Sutras were composed in the old *Grammatical Sanskrit*, while *the people spoke* and Gautama preached in the 6th century B. C., in a somewhat simpler aud more fluent language. What that language was we know from the edicts of Asoka, for the spoken tongue could not have changed very much from 477 B. C., when Gantama died, to 260 B. C., when Asoka reigned. *The spoken language* of the third or Rationalistic Period, was an early form of *Pali*, by whatever names (*Magadhi &c.*) Antiquarians may choose to call it. And varieties of this language continued to be the spoken tongue of Northern India during the 4th or Buddhist Period.

"In the fifth or the Puranic Period the *Pali* had been considerably altered and *formed into the different Prakrit dialects which we find in the dramas of this period*. The grammatical

forms of the Prakrit differ more widely from the Sanskrit than those of the Pali, and historically too, we know that *the spoken language of Kalidasa's heroins was later than the spoken language of Asoka* "

ఇటు నిట్లు మార్పులు చెప్పుటచే ప్రాకృతము లక్షణబద్ధము కాదని తెలియుచున్నది.

కాళిదాసుని కాలముంగూర్చి వీబరు (Weber) ఇట్లు తెల్పుచున్నారు —

" The form in which the popular dialects appear, and which as compared with the inscriptions of Piadasi, is extraordinarily degraded, not unfrequently coinciding with the present form of the vernaculars, brings us down to a period at any rate several centuries after Christ."

దీనివలన రూపకములందలి ప్రాకృతము ఆయాకాలపు సంస్కృత గ్రామ్యమని విశదముగదా.

"ప్రాకృతవ్యాకరణస్య నిష్పన్నత్వేపి తస్యాద్యభాషామధ్యే ప్రయోగో గ్రామ్యత్వమ్ "—కవిశిరోభూషణము

దీనివలనను ప్రాకృతము సంస్కృతగ్రామ్యమని స్పష్టపడుచున్నది.

మఱియు దీనినిగూడ నరయుడు:—హృషీకేశశాస్త్రిగారు తమ ప్రాకృత వ్యాకరణావతారిక యందిట్లు వ్రాసియున్నారు.

" Lalla in his commentary on Mrichchakati says :— కేషాంచిన్మతే చతస్రోభాషాః । శౌరసేన్యవన్తిజా ప్రాచ్యామాగధ్యః । కేషాంచిన్మతే, మాగధ్యవన్తిజా ప్రాచ్యా శౌరసేన్యర్ధమాగధీ । బాహ్లీకీదాక్షిణాత్యాచ సప్తభాషాః ప్రకీర్తితాః ॥ It is obvious from the above that the number of Prakrita dialects increased gradually and *not all at once*."

ఆగ్రంథమున నే:—

" Whether the pure Sanskrit Language remained a spoken dialect for any length of time even in its native land, the Brahmavarta, seems to be open to question. But that the learned and

the higher classes long continued to use it in their dialy conversation and exchange of thought, may be assumed from the Universal practice of the dramatists in putting the Divine language into the mouth of their higher personages."

ఋజుబుద్ధులకు ఇట్లు రూపకమర్యాదనుబట్టి ప్రాకృతములు ఆయానీచజనులు లోకములో భాషించుచుండిన గ్రామ్యములనునూహా న్యాయ్యమై యున్నది.

మఱల ఆగ్రంథమందే:—

"It was the peculiarity of our ancient forefathers to bind every practice by rigid rules, so that *even when the reality had ceased to exist*, no departure was allowed from the practice of dramatic representation having the sanction of ages. In the same manner any *uniformity* or fanciful excellence which they thought they had discovered in *a people speaking a particular dialect* came to be regarded as inherent in them for ever afterwards, and the work of a dramatist who ventured *to violate any such recognized principles was pronounced unfit to be considered a classic.*

"Mark how boldly and dogmatically the author of Sahityadarpana regulates the application of the different Prakrit dialects in a drama. 'High born and educated persons must speak Sanskrit and women similarly circumstanced are to speak the Souraseni dialect. These latter, however, should employ the Maharashtri in their sogs and Verses. The Magadhi is mentioned as the tongue of those who move in the inner apartments of a king. The dialect of servants, princes and merchants is the Half-Magadhi. The Prachaya[Eastern or Goudiya] is the dialect of the Vidushaka and others, and the Abanti of the gamesters. Dravidi or the Southern dialect is spoken by the soldiers and gamblers. The Sakari must be used by the left-hand brother-in-law of kings, by the Sakas and others. The Vahliki dialect belongs to the people of Northern India, and the Chandali to the Chandalas and others. The Abhiri and Sabari are spoken by workers upon wood and by charcoal-makers. The Paisachi is the tongue of the Pisachas and also of female attendants.' "

"Even when the *reality* had ceased to exist" అనుటచే నీభాషలనెల్ల నాంధ్రగ్రామ్యజనులు భాషించుచుండిరనియు ఆహేతువుచే నవి వారివారికి రూపకములం బ్రయుక్తమాయెననియు విశదము. మఱియు ఈభాషలు అంతరించిన యనంతరము నయితము భాషాభేదానిర్వహణము దోషముగాను కావ్యత్వభంజకముగాను లాక్షణికులుతలంతురని హృషీకేశపండితులు వ్రాసినవ్రాతను ముందుం జేర్పుదు.

భరతముని ప్రకరణలక్షణమునం జెప్పిన నియమముం గనుండు.—

## XVII.

యది వా ప్రకరణయుక్త్యా వేశకులస్త్రీకృతోపచారం స్యాత్।
అవికృతభాషాచారం తత్రతుపాఠ్యం ప్రయోక్తవ్యమ్॥

ఇందు "అవికృతభాషాచారమ్" [భాషాచారములు మార్పక] అను విశేషణము పూర్వోక్తమయిన 'reality' అనుమాటతోం దులందూంగు చున్నది.

కథాసరిత్సాగరములోని యీ 'మోదకైస్తాడయ' కథను వినుండు:-

అస్తికాతస్యమహిషీ రాజ్ఞః స్తనభరాలసా
శిరీషసుకుమారాఙ్గీ క్రీడన్తీక్లమమభ్యగాత్.
సాజలైరభిషిఞ్చన్తం రాజానమసహాసతీ
అబ్రవీన్మోదకైర్దేవ పరితాడయమామితి.
తచ్ఛ్రుత్వామోదకాన్రాజా ద్రుతమానాయయన్బహూన్.
తతోవిహస్యసారాజ్ఞీ పునరేవమభాషత
రాజన్నవసరఃకోఽత్ర మోదకానాంజలాన్తరే
ఉదకైస్సిఞ్చమాత్వంమా మిత్యుక్తంహిమయాతవ.
సంధిమాత్రంనజానాసి మాశబ్దోదకశబ్దయోః
నచప్రకరణంవేత్సి మూర్ఖస్త్వంకథమీదృశః.
ఇత్యుక్తస్సతయారాజ్ఞ్యా శబ్దశాస్త్రవిదానృపః
పరివారేహసత్యన్తర్లజ్జాక్రాన్తోఝుగిత్యభూత్.

* * * * * * * * *

తతోఽహమవదంరాజన్ వర్షైర్ద్వాదశభిస్సదా
జ్ఞాయతేసర్వవిద్యానాం ముఖంవ్యాకరణంనరైః.
అహంతుశిక్షయామిత్వాం వర్షషట్కేనతద్విభో.
శ్రుత్వైతత్సహసాసేర్ష్యం శర్వవర్మాకిలావదత్.
సుఖోచితోజనఃక్లేశం కథం కుర్యాదియచ్చిరమ్.
తదహంమాసషట్కేన దేవత్వాంశిక్షయామితత్.
శ్రుత్వైవైతదసంభావ్యం తమవోచమహంరుషా
షడ్భిర్మాసైస్త్వయాదేవః శిక్షితశ్చేత్తతోమయా
సంస్కృతంప్రాకృతంతద్వత్ దేశభాషాచసర్వథా
భాషాత్రయమిదంత్యక్తం యన్మనుష్యేషుసంభవేత్.

అవిద్వాంసుఁడైన శాతవాహనుఁడు దేవియొక్క సంస్కృత భాషితమును [సంధివెలిగా నేనియు] గ్రహించెననుటచేతను, ప్రాకృత దేశభాషలు రెండే ఇఁకనుండిన వనుటచేతను, రాజు ప్రాకృతభాషి యనియు తదీయప్రాకృతము సంస్కృత గ్రామ్యమనియు విశదముగదా.

ముద్రారాక్షసములో పాములవాఁడొకండు ప్రాకృతకవి.

ఈ రుద్రటకారికా తద్వ్యాఖ్యలం గనుఁడు:—

ప్రాకృతసంస్కృతమాగధ పిశాచభాషాశ్చ శూరసేనీచ।
షష్ఠోఽత్రభూరిభేదో దేశవిశేషాదపభ్రంశః॥

సకలజగజ్జన్తూనాం వ్యాకరణాదిభిరనాహితసంస్కారః సహజో వచనవ్యాపారః ప్రకృతిః తత్రభవం సైవవా ప్రాకృతమ్। 'ఆరిసవఅణేసిద్ధం దేవాణం అద్ధమాగహావాణీ' ఇత్యాదివచనాద్వా ప్రాక్పూర్వంకృతం ప్రాకృతమ్। బాలమహిళాదిసుబోధం సకలభాషానిబన్ధనభూతం వచనము చ్యతే। మేఘనిర్ముక్తజలమివైకస్వరూపమ్। తదేవచ దేశవిశేషాత్సంస్కారకరణాచ్చ సమాసాదితవిశేషసత్ సంస్కృతాద్యుత్తరవిభేదా నాప్నో

తి। పాణిన్యాదివ్యాకరణోదిత శబ్దలక్షణేనసంస్కరణా త్సంస్కృతము చ్యతే। తథాచప్రాకృతభాషైవ కించిద్విశేషలక్షణాన్మాగధికాభణ్యతే।... ......తథాప్రాకృతమేవ కిఞ్చిద్విశేషాద్పైశాచికమ్।.........శౌరసే న్యపిప్రాకృతభాషైవ।......తథా ప్రాకృతమేవాపభ్రంశః । సచాన్యైరు పనాగ రాభీరగ్రామ్యత్వభేదేన త్రిధోక్తః। తన్నిరాసార్థముక్తం భూరి భేద ఇతి । కుతః దేశవిశేషాత్ కారణాత్ । తస్యచలక్షణంలోకాదేవ సమ్యగవసేయమ్.

ఇట "లోకాదేవ" యనుమాట వరహాలమూటగదా. ఇందువలన అపభ్రంశము రూపకములందు ప్రయోక్తవ్యమగుటకు వ్యాకరణశాస్త్ర పరిష్కారము హేతువుగాదని విశదముగదా. ఇది గ్రామ్యమయ్యును కవిప్రయోగానర్హమయ్యును రూపకమర్యాదంబట్టి పాత్రోచితముగా ప్రయోక్తవ్యమాయెననం బ్రమాణముం గనుఁడు:—

షడ్భాషాచన్ద్రిక.

అపభ్రంశస్తుభాషాస్యా దాభీరాదిగిరాంచయః
కవిప్రయోగానర్హత్వా న్నాపశబ్దస్సతుక్వచిత్.

తథాచోక్తం దణ్డినైవః—

ఆభీరాదిగిరఃకావ్యే ష్వపభ్రంశఇతిస్మృతా
శాస్త్రేతుసంస్కృతాదన్య దపభ్రంశతయోదితమ్.
అపభ్రంశస్తుచణ్డాల యవనాదిషుయుజ్యతే
నాటకాదావపభ్రంశ విన్యాసస్యాసహిష్ణవః
అన్యేచణ్డాలకాదీనాం మాగధ్యాదిప్రయుఞ్జతే

ఈప్రకరణమువలన, అపభ్రంశముచే మడిచెడు నన్ననీరసులు పూర్వంబునుండిరనియు దణ్డ్యాచార్యప్రభృతిరసజ్ఞులు వారిని దండించి ఆభాషను రూపకములందు నెక్కొల్పిరనియునుంగూడ విశదము. అటు తర్వాత దానికిం గలిగినవైభవముంగనుఁడు:—అపభ్రంశమహాకావ్యము

మహాభారత సేతుబంధములవెంబడి పరిగణితమైయున్నది.

సాహిత్యదర్పణము:—

అస్మిన్నార్షే పునస్సర్గా భవన్త్యాఖ్యానసంజ్ఞికాః.
అస్మిన్=మహాకావ్యే, యథామహాభారతమ్.

[సేతుబన్ధాదిక మిట నుక్తము.]

అనభ్రంశనిబద్ధేస్మిన్ సర్గాః కడబ కాభిధాః
తథాపభ్రంశయోగ్యాని ఛన్దాంసివివిధాన్యపి.

యథాకర్ణపరాక్రమః

ఇందులకు బాలెంటైనుగారి భాషానువాదము:—

TEXT.

A great poem in a Corrupt dialect (Apbhramsa).

No 562. The Cantos belonging to a great poem written in any of the *Corrupt dialects* (Apabhramsa) are styled Kadavakas. A variety of Metres befitting the *Corrupt dialects* are employed in it.

COMMENTARY.

The Karna Parakrama or the Valour of Karna is an instance.

ఈగ్రామ్యప్రయోగమందు అసాధుత్వాభావమాత్రముగాక గుణత్వముకూడ చెప్పఁబడియున్నది.

"అధమప్రకృత్యుక్తిషుగ్రామ్యోగుణః" అని కావ్యప్రకాశ. "అధమతా ప్రకాశనస్యైవోద్దేశ్యత్వాద్గుణత్వమ్" అని టీక.

ఇట, కారికోక్తమైన యీగ్రామ్యము అపశబ్దరూపమయినది గాకపోయినను, అధమప్రకృతికత్వము అధమతాప్రకాశనోద్దేశ్యకత్వము రెంటికి సమముగాన, అపశబ్దరూపగ్రామ్యమునకును అన్యగ్రామ్యోక్తగుణత్వము న్యాయలబ్ధము.

ఈగ్రామ్యప్రయోగము గుణముమాత్రముగాక అలంకారము గూడనని భోజమహారాజు అనుశాసించియున్నాఁడు:—

శబ్దాలంకారసంజ్ఞాస్తే జ్ఞేయాజాత్యాదయోబుధైః.
జాతిర్గతీరీతివృత్తి చ్ఛాయాముద్రోక్తియుక్తయః
చతుర్వింశతిరిత్యుక్తాః శబ్దాలంకారజాతయః
అథాసాంలక్షణంసమ్యక్సోదాహరణముచ్యతే.
తత్రసంస్కృతమిత్యాదిః భారతీరీతితిష్యతే
సాత్వౌచిత్యాదిభిర్వాచా మలంకారాయజాయతే.

టీక॥ ననుశబ్దేన సంస్కృతాద్యన్యతమేనభవితవ్యమ్ । తత్రోక్త్రకవేః శక్తివ్యుత్పత్త్యోరంశః యేనాలంకారతాస్యాదిత్యత ఆహ। సేతి। ఔచిత్యాకృష్ట ఏవాలంకారః । అస్తిచసంస్కృతాదేరపి తథా భావ ఇతి భావః॥

సంస్కృతేనైవకేప్యాహుః ప్రాకృతేనైవకేచన
సాధారణ్యాదిభిఃకేచి త్కేచనమ్లేచ్ఛభాషయా.

టీక॥ యద్యపి అర్థౌచితీపూర్వందర్శయితుముచితా తథాపిప్రాధాన్యమావేదయితుమ్ పృథక్త్వౌచితీమాహ । సంస్కృతే నైవేతి॥

నమ్లేచ్ఛితవ్యంయజ్ఞాదౌ స్త్రీషునాప్రాకృతంవదేత్
సంకీర్ణంనాభిజాతేషు నాప్రబుద్ధేషుసంస్కృతమ్.

టీక॥ విషయౌచితీమాహ। నమ్లేచ్ఛితవ్యమిత్యాది । మ్లేచ్ఛనమపశబ్దః, ప్రాకృతం సంస్కృతభవమ్ । అభిజాతః శుద్ధాన్వయః॥

దేవాద్యాస్సంస్కృతంప్రాహుః ప్రాకృతంకిన్నరాదయః
పైశాచావ్యంపిశాచాద్యాః మాగధంహీనజాతయః.

టీక॥ అథకేసంస్కృతాద్యుచితవక్తార ఇత్యత ఆహ । దేవాద్యా ఇతి । ఆదిగ్రహణేన ఋషిభూమిపతిప్రభృతయః॥

సంస్కృతేనైవకోప్యర్థః ప్రాకృతేనైవచాపరః
శక్యోరచయితుంకశ్చి దపభ్రంశేనజాయతే.

టీక॥ వాచ్యౌచితీందర్శయతి । సంస్కృతేనై వేతి । యథాహి దేవతాస్తుత్యాదౌ సంస్కృతంప్రగల్భతే న తథా ప్రాకృతాది । యథాసూక్ష్మవస్తుస్వరూపోట్టఙ్కనే ప్రాకృతస్యసౌ ష్ఠవం నతథాసంస్కృతాదేరిత్యాది।

నాత్యన్తంసంస్కృతేనైవ నాత్యన్తందేశభాషయా
కథాంగోష్ఠీషుకథయఁ ల్లోకేబహుమతోభవేత్.

టీక॥ విషయౌచిత్యమేవ క్వచిద్విశేషే కాన్తిప్రకర్షమర్పయతీత్యాహ । నాత్యన్తమితి । సమానబుద్ధిశీలవయసాం వినోదార్థమాసనబన్ధోగోష్ఠీ।

శృణ్వన్తిలటభంలాటాః ప్రాకృతంసంస్కృతంద్విషః
అపభ్రంశేనతుష్యన్తి స్వేననాన్యేనఘుర్జరాః.

టీక॥ దేశౌచితీమాహ । శృణ్వన్తీతి । లటభం మనోజ్ఞం । స్వేనఘుర్జరజాతీయేన।

కేఽభూవన్నాఢ్యరాజస్య రాజ్యేప్రాకృతభాషిణః
కాలేశ్రీసాహసాఙ్కస్య కేనసంస్కృతభాషిణః.

టీక॥ సమయౌచిత్యందర్శయతి । కేఽభూవన్నితి । ఆఢ్యరాజఃశాలివాహనః । సాహసాఙ్కో విక్రమాదిత్యః । గ్రన్థకర్తృపూర్వజతయా శ్రీపదమ్।

గిరఃశ్రవ్యాదివ్యాఃప్రకృతి మధురాఃప్రాకృతధురాః
సుభవ్యోఽపభ్రంశఃసరసరచనంభూతవచనమ్।
విదగ్ధానామిష్టే మగధమథురావాసిభణితే
నిబద్ధాయస్తేషాం సఇహకవిరాజోవిజయతే॥

టీక॥ ప్రతిభార్థప్రాణనా జీవద్వర్ణనా నిపుణోహి కవిః । సఏవహి సర్వపథీనతా దృగుక్తిసిద్ధిసంపన్నః కవిరాజః। అతఏవ విజయతే సకలలోకశాస్త్రవచన నిర్మాతృభ్యః ప్రకర్షేణవర్తతేఇతి॥

శుద్ధా సాధారణీ చైవ సంకీర్ణా నాన్యగామినీ
అపభ్రష్టేతి సాచార్యై ర్జాతిష్షోఢా నిగద్యతే.

టీక॥ తాసు ఉత్తమపాత్రప్రయోజ్యా సంస్కృతజాతిః శుద్ధా యథా । ఉన్నమితైకభ్రూలతమిత్యాది । మధ్యమపాత్రప్రయోజ్యా ప్రాకృతజాతిశ్శుద్ధా యథా। తుజ్ఝణ అణే ఇత్యాది.

[ఇట్లే వరుసగా మాగధికాపైశాచీ శౌరసేన్యపభ్రంశముల శుద్ధజాతు లుదాహరింపఁబడియున్నవి ]

ప్రాయికం చైతత్ । తేన క్వచిదేకైవ ప్రాయశః క్వాదిభ్యః సర్వా ఆపి సర్వప్రయోజ్యా భవన్తి.

టీ ॥ ..................యత్ర వా* ప్రబన్ధౌచితీపరవశాః సంస్కృతాదిజాతయో విపర్యస్యన్తే । యథా చ సర్గబన్ధాదౌ మధ్యమాదేరపి సంస్కృతమేవ। ఖణ్డకథాపరకథాదౌ ఉత్తమాదేరపి ప్రాకృతమేవ। బృహత్కథాదౌ పైశాచమేవ । వస్తుబన్ధాదౌ అపభ్రంశ ఏవేతి । † తత్ర సంధిసంధ్యఙ్గ ఘటనాసౌష్ఠవేన రసః పుష్యతీతి భరతముని ప్రభృతీనామతిప్రకాశ ఏవ పన్థాః॥

మధ్యమపాత్రభూమికాస్థోత్తమపాత్రప్రయోజ్యా సంస్కృతప్రాకృతయోస్సాధారణీ యథా । సరళే ఇత్యాది.

[ఇట్లే యిట సంస్కృతపైశాచికల సాధారణి లోనుగా నుదాహరింపఁబడియున్నవి.]

వక్తృవిషయౌచిత్యాదిప్రయోజ్యా మిశ్రా యథా!...
దుర్విదగ్ధాదిపాత్రప్రయోజ్యా సంకీర్ణా యథా।
అకటగుమటీచన్ద్రిజ్యోత్స్నాకలంకలకోఇలో
లవఇలముపస్సుర్యోమ్యోవాయుర్నివార అవాఇఅ।
అవిసఖిఅలారక్తాశోకస్తవాపివనోముదే
నకిజనకజామానే నాద్యప్రియం ప్రతిజాహుదా॥

---

* శ్రవ్యప్రబంధములు. † జాత్యలంకారము లేకున్నను.

ఏవం సంస్కృత మహారాష్ట్రాపభ్రంశయోగ స్త్రీలతణ్డులవత్ సంకీర్ణాజాతిః। ........ఏవం ప్రాకృతాపభ్రంశ సంకరోపి ద్రష్టవ్యః। క్రీడాగోష్ఠీవినోదా ద్యర్థానాన్యగామినీ అసాధారణీయథా ।

భీష్మప్రోక్తానివాక్యాని విద్వద్వక్త్రేషు శేరతే
గోసేతిరిఙ్ఖిరిఙ్ఖోళీ తల్లతూహేవివల్లిదా.

టీక॥ తల్ల=అల్పసరః, తూహే=తోయే, వివల్లిదా=ప్రసారితా.

అపభ్రష్టాయథా:—

ముద్ధేగహణఅగ్గెణ్హాఉ తంధరిముద్దంణివహత్థే
ణిచ్ఛఉసుందరితుహఉఙరి మజ్ఝ సురఅప్పహో అత్థి

నేయమపశబ్దప్రయోగతః అపభ్రష్టాపి అవిద్వద్భిశ్శ్రోత్రియాద్యైః ప్రయుజ్యతే ఇత్యపభ్రష్టాజాతిః। అస్యా అపిచ అనుకరణేసాధుత్వమిష్యతే॥

[ఏతత్సజాతీయములే "వస్సారషరయ్యా," "ఆమ్రాటకేమంచ న్నావే, ఓలంజమ్మా," ఇత్యాదులు.]

టీక॥ ...ఇత్యాదిక మపశబ్దబహుళత్వేన అపభ్రష్టా స్పష్టైవ సాతు కథమలంకార ఇత్యత ఆహ। నేయమితి।...సర్వఏవహి లౌకికః పదార్థః అభినయకక్ష్యామధిరూఢః పరిత్యజ్యగ్రామ్యత్వ మభిముఖీభూతో విభావాదిషు కథంనాలంకారః।తదిదముక్తం ప్రయోగత ఇతి । నచాపశబ్దానాం దోషత్వమేవేతివాచ్యమ్ । అనుకరణేతుసర్వేషా మితిదోషసామాన్యానలమ్బినాగుణీభావేన అస్యవిషయీకృతత్వా దితి॥

ఇట్లు భోజమహారాజునకు అలంకారముగాఁదోఁచిన యపభ్రష్ట భాష (అపభాషణానుకరణము, రూపక గ్రామ్యప్రయోగము) నిషేధలోలుభులకు శ్విత్రముగాఁదోఁచినది! వీరికనులకు నీచపాత్రముల వ్యాకృత భాష, అనౌచిత్యదోషదూషితభాష (అనఁగా) శ్విత్రము, అలంకారముగాఁ దోఁచినది!

ఈజాత్యలంకారముచే శ్రవ్యకావ్యశారదను అలంకరింపమి క్షంతవ్యమని లక్షణకారులు చెప్పికొనిన పైసమాధానముచేత నిది దృశ్యకావ్యములయందు, ఎంతయపరిహార్యమో ఎంతయావశ్యకమో యూహించుకొనుఁడు.

ఔచిత్యము కారణముగాదనియు, స్త్రీశూద్రాదులకిడిన సంస్కృతము మడిచెడుననుట కారణమనియు, విమతులుపల్కిరిగదా! శ్రీమద్రణరంగమల్ల నృపతి ఔచిత్యమే కారణమని పల్కిన పూర్వోక్తసుభాషితభూషణములను కంఠమున ధరింపుఁడు

ఈయౌచిత్యము నుల్లంఘించుటచే నేమేనిదోషమా? ఉత్తరము వినుఁడు; కావ్యప్రకాశికా రసగంగాధరకారులచే ప్రమాణీకరింపఁబడిన యీధ్వనికారకారిక నవధరింపుఁడు:—

అనౌచిత్యాదృతేనాన్య ద్రసభఙ్గస్య కారణమ్
ఔచిత్యోపనిబన్ధస్తు రసస్యోపనిషత్పరా.

కావ్యప్రకాశకారుఁ డిట్లుపల్కుచున్నాఁడు:—

ఏవం దేశకాలవయోజాత్యాదీనాం వేషవ్యవహారాదిక ముచితమేవోపనిబద్ధవ్యమ్. ఉక్తంహిధ్వనికృతా । అనౌచిత్యాదృతే...

రసగంగాధరమంకిట్లున్నది:—

అనౌచిత్యన్తు రసభఙ్గహేతుత్వా త్పరిహరణీయమ్। భఙ్గశ్చ పానకాదిరసాదౌ సికతాదినిపాతజనితే వారున్తుదతా।తచ్చజాతిదేశకాలవర్ణాశ్రమవయోఽవస్థా ప్రకృతివ్యవహారాదేః ప్రపఞ్చజాతస్య తస్య యల్లోకశాస్త్రసిద్ధ ముచితద్రవ్యగుణ క్రియాదితద్భేదః......తథావిద్యావయోవర్ణాశ్రమతపోభి రుత్కృష్టైః స్వతోఽప కృష్టేషు న సంబహుమానేన వచసా వ్యవహర్తవ్యమ్......తత్ర రత్యాదీనాం భయాతిరిక్తస్థాయిభావానాం సమత్వేపి రతేః సంభోగరూపాయాః మనుష్యేష్వివోత్తమ

దేవతాసు స్ఫుటీకృతసకలానుభావవర్ణన మనుచితమ్......జయదేవాది భిస్తు గీతగోవిన్దాది ప్రబన్ధేషు సకలసహృదయ సమ్మతోఽయం మదోన్మత్త మతఙ్గజైరివ భిన్న ఇతి నతన్నిబర్హణేన ఇదానీన్తనేన తథా వర్ణయితుం సాంప్రతమ్......తథాచాహుః। అనౌచిత్యాదిత్యాది.

జగన్నాథపండితుఁడు జయదేవునింగూడ ఔచిత్యభంగదోషమునకు క్షమింపమి పరికించితిరా?

## మఱికొన్ని యాక్షేపసమాధానములు.

(1) సౌలభ్యప్రధానములఁట హూణరూపకములు, అందుచేత వానియందు గ్రామ్యములు (Provincialisms) ప్రయుక్తములఁట, సంస్కృతాంధ్రరూపకము లట్టివిగావఁట, కాన సంస్కృతరూపకముల గ్రామ్యములం బెట్టలేదఁట, ఆంధ్రరూపకములందుఁ బెట్టరాదఁట:—ఇందు నాలవయఁటకు ఇప్పటికేయుత్తరము వచ్చియున్నది. ఇతరములకిదెయుత్తరము. ఆంధ్రనాటకములు సౌలభ్యసాపేక్షములు కావని వీరికెవ్వరు నేర్పిరి? సంస్కృతరూపకములు సౌలభ్యసాపేక్షములుగావా? ఈ భరతప్రోక్తముఁగనుఁడు:—

## XXVII.

కఃశక్తోనాట్యవిధౌ యథావ దుపపాదనేప్రయోగస్య
కర్తవ్యంవాగ్రచనం యథావ దుక్తంపరిజ్ఞాతుమ్.
తస్మాద్గమ్భీరార్థాః శబ్దా యేలోకవేదసంసిద్ధాః
సర్వజనగ్రాహ్యాస్తే సంయోజ్యానాటకేవిధివత్.

ఈవిషయము ఎల్లభాషలకుసమానముగాన ఎల్లభాషలయందును రూపకము సౌలభ్యనిరూఢముగానే యుండవలయును. వీరివాదముం బట్టియే సౌలభ్యార్థము గ్రామ్యము ప్రయోక్తవ్యమని ప్రాప్తించినది. కాని యీగ్రామ్యముచే సౌలభ్యములేదని వీరేకొండొకపరి బూకరించియున్నారు చిత్తూరి యెల్లగ్రామ్యము రాజమహేంద్రవరమువారికి బోధ

పడదఁట, అల్లే వారిది చిత్తూరివారికినఁట. మఱి దీనిచేతనే సౌలభ్యమఁట! ఇవేసుఁడీ యద్భవిష్యగతులు మఱియు, ఎవరికి సౌలభ్యము? సామాజికులకా? కాదని వీరియొకవాదము. కవికా? కవికి కష్టమని యుక్కాలపునాటకములలో ఆజతనము చేసి భంగపడినవారే నిదర్శనము. సౌలభ్యార్థము హూణరూపకములందు గ్రామ్యము ప్రయుక్తమనుట హూణభాషానభిజ్ఞతం జక్కఁగఁ జాటుడమారముగానున్నది.

(2) ఇంకొక యాక్షేపము—ప్రాకృతములెల్ల మన యాంధ్ర ద్రావిడ కర్ణాటభాషలవలె వెవ్వేఱు భాషలఁట, ఒక ప్రాకృతమువారికి మఱియొక ప్రాకృతము బోధపడదఁట, ఇన్ని భాషలు ఏకకుటుంబమున భాషించుటచే బెబెలుగోపురకథయగునఁట.— ఈవిషయము పుష్కలముగా దత్తోత్తరము.

(3) ప్రాకృతములకు వ్యాకరణములుండిన హేతువుచే వానిని రూపకములందు ప్రయోగించిరఁట. ఇదియు ప్రాయికముగా దత్తోత్తరమే. అయినను:—

గౌడవహము, అవతారిక:—

"Till Hemachandra wrote his chapter on Prakrit Grammar, Vararuchi was the chief authority on the construction of Prakrit dialects, and lucid and useful as his aphorisms are, they are not thorough, and appear to have been intended rather to explain *the chief features of the corruption* through which the more striking Prakrit words and forms derived their origin, than to give a complete treatise on the formation of all or even most Prakrit words and forms, such as that which Hemachandra endeavoured many centuries after, to write regarding one of the Prakrit dialects.

"The most complete grammar extant is that of Hemachandra (A. D. 1089—1174). Much had existed in Prakrit which was not explained by Vararuchi whose grammar was not intended to be exhaustive, but merely illustrative of a few prominent facts. One or two of the Prakrit dialects are disposed of by him in less than twelve aphorisms of three or four words each. And even Hema-

chandra is not much more exhaustive in his treatment of some of the dialects. We may remember that Vararuchi must have had sufficient materials *in living speech*, if he had intended to explain the formation of all the dialects, but Hemachandra could only rely upon *the scanty specimens of written remnants of some of the more obscure dialects for materials wherewith to form and illustrate his rules regarding those dialects.*

[హేమచంద్రుని కాలమునకు ప్రాకృతములంతరించినవనియు, అతని వ్యాకరణము ప్రయోగమూలమనియు, ఆప్రయోగములకు వ్యాకరణము మూలముగాదనియు దీనివలనం దెలియుచున్నది.]

"We may safely believe, therefore, that the Prakrit works must be regarded as written in genuine vernacular, if written when Prakrit was vernacular, and in genuine Prakrit acquired by study if written after the language had become a dead language."

ఇందువలన ప్రాచీనతరకవులు తమ రూపకములలో దేశభాషలను స్వానుభవ జ్ఞానముచే వ్రాసినవారేగాని చదివినేర్చి వ్రాసినవారుకారని స్పష్టముగదా. ప్రయోగానంతరము ప్రాకృతము లంతరించుచున్నతఱిని, అంతరించిన పిమ్మటను, వ్యాకరణములేర్పడినవి. అవియును నసమగ్రములే. వ్యాకరణములు లేనపుడే తదీయ ప్రయోగము భరతమునిచే ననుశిష్టమాయెను. వాల్మీకి మూలసూత్రకారుడంట. ఆతడు రామాయణకారుడే యయిననగుగాక, సూత్రములుగాని వరరుచ్యాదుల వ్యాకరణములుగాని ప్రాకృతమున కెంతమాత్రము చాలిన లక్షణములు గావు.

Professor Cowell.—"When the Greeks, under Alexander, came in contact with India, Prakrit seems to have been the *spoken dialect* of the *mass* of the people. The language of the rock-inscriptions of King Asoka ... ... ... ... ... ... is also a form of Prakrit. It also plays an important part in all the *ancient* Hindu dramas: for while the heroes speak Sanskrit, the women attendants use various forms of Prakrit, the dialectical variations being more or less regular and euphonious according to the rank of the speaker. The later grammarians include many varieties

under the name [Prakrit] but most of them are prohably the subtle refinements of a later age; as the older the grammarian is, the fewer we find the dialects to be, *and the oldest Vararuchi has treated only of four.*"

(4) రూపకగ్రామ్యముచే భాష చెడునఁట.—ఉపక్రమవంతముగా రూపకములందు ప్రయుక్తమయిన గ్రామ్యముచే చెఱుపు లేనే లేదు గాని, శబ్దలక్షణమెఱుఁగక పండితమానులు ఉపక్రమహీనముగా ప్రయోగించు గ్రామ్యములచేత వీరి పాండిత్యాభినయములకు మోస పోయి వీరియందు ప్రత్యయముంచునజ్ఞులు చెడుదురు.

"పతిమతి" [రాణి], "కోకిలయాకలి కూడగు నధరి," "అచ్చ రాంగనలు," "భానుఁడగు సేతూపతీసుతుండు," "యశోహచ్చంద్ర హాసంబు," "ఎక్కిడఁ బడఁదయెన్నఁడు," "సహస్రాంశ్వభీషవలోకంబు," "అసురీలీలావతి" "విద్రుమలతా శ్రీకాంగుళిశ్రేణికలు... చేతులు," "చందురుమోము" [ఉపమానపూర్వపదకర్మధారయము,] "రమాబోటీ ధవుఁడు," "సుమనోల్లాసము" (సుమనస్+ఉల్లాస-అను శబ్దముల సమాస మఁట), "ఖరశిశుపాలు," "శబ్దాదినియుండవలయును," "అహరహోపా సితుఁడు," "షష్ఠమాశ్వాసము,"—వీనిచే భాష చెడును.

(5) గ్రామ్యమువలన భాషకు "లాభము" (వృద్ధి) లేదఁట— బొజ్జ, అజాగళస్తనము ఇత్యాదులవలన దేహమునకు ఏపాటిపుష్టి? కాన బ్రహ్మసృష్టిని దిద్దుదము. షేక్సుపియరుభాష న్యాయస్థానములలో, వార్తాపత్త్రికలలో, శాస్త్రకావ్యకళానాటకాదులలో నెచటనుపనికిరాదు. ప్రాకృతంబులును, అట్లే కర్మకళాశాస్త్రములకుపనికిరావు. నాటకము లలో నవిలేకున్నను పూర్వపక్షులమతంబునలోపంబులేదు. వృథాగా లక్షణములుచదివి యీ ప్రాకృతస్వరూపమును నేర్వవలసియున్నది. ఏల వీనిని యూనివర్సిటీవారు చదివించుచున్నారు? రూపకములురసముకొఱ కేగాని, ఓనమాలు నేర్పుటకుఁగావు. హిందూ నాటకములంగూర్చి విల్స నుగారిసూక్తి:—

Wilson, Hindu Theatre:—"Exceedingly deficient in theatrical effect. The affectation or reality of scholarship, a very sorry substitute for the *universal, instantaneous and irrepressible delight.*"

(6) ప్రాకృతములకు లక్షణములు కలవనువాదముంగూర్చి మఱియొకమాట:- ఆలక్షణములను ఆప్రాకృతజనులు చదివి తదనుగుణముగా భాషించుచుండిరని యభిప్రాయమా ? ఈపక్షము కేవలమసంబద్ధము. పూర్వకాలమున సకలజనులును ఆబాలగోపాలము చదివినవిద్వాంసులని వీరెంతఘోషించినను ఇప్పటివారెవ్వరును నమ్మరు. ఎవరేని ఏభాష కేని రెండువ్యాకరణసూత్రపుముక్కలు వ్రాసిపెట్టిననేగాని మఱియెవ్వరును అందుగ్రంథములు చేయరాదా? ఆ తొలివ్యాకరణకారుఁ డెట్లు ఆవ్యాకరణగ్రంథమును చేయనర్హుఁడు? ఆతఁడు మఱియొక వ్యాకృతభాషయందే వ్యాకరణమును వ్రాయవలయును కాబోలు! ఆభాషనే చక్కఁగ అనుభవము చేనెఱింగినవారికి సూత్రములేల? సాక్ష్యమున కుండవలయునేని, ఆంధ్రగ్రామ్యమునకు సి. పి. బ్రౌను దొరగారు, ఉదయగిరి శేషయ్యగారు, మహోపాధ్యాయ శ్రీ శేషగిరిశాస్త్రులవారును చేసిన లక్షణగ్రంథములు సాక్ష్యమునకున్నవిగావున, ఇఁక గ్రామ్యప్రయోగనిషేధపరమైనవాదమును మానుకొనందగును. ఇవిసమగ్రలక్షణములుకావా? వాల్మీకిసూత్రములపాటి, వరరుచివ్యాకరణముపాటి, సమగ్రములే ఇవియు. బ్రౌనుప్రభృతుల లక్షణగ్రంథములను మనము చదువముగాన రూపకములగ్రామ్యము వ్రాయునధికారము మనకులేదు కాఁబోలు ! ఐరోపీయనులు వానిం జదువుదురుగాన వారికేతత్ప్రయోగమునకు అధికారము సిద్ధముకావలయు! లేక అధికారార్థము మనము ఆబ్రౌన్యాద్యపభ్రంశవ్యాకరణములను గురుముఖముగా శాంతిసేయవలయునా?

గ్రామ్యనిషేధాభాసము అదియే గ్రామ్యవిధానము కొందఱు, సింగభూపాలీయమునుండి,

"పిశాచభాషానిర్దేశ నామభిస్త్రివిధామతా.

తత్రభాషాద్విధాభాషా విభాషా చేతిభేదతః.

చతుర్దశవిభాషాఃస్యుః ప్రాచ్యాద్యా వాక్యవృత్తయః.
ఆసాంసంస్కారరాహిత్యా ద్వినియోగోనకథ్యతే
ఉత్తమాదిషు, తద్దేశ వ్యవహారాత్ప్రతీయతామ్.
భాషాద్వేధాసంస్కృతాచ ప్రాకృతీ చేతి భేదత.."

అని యుదాహరించి, ప్రాచ్యాదిచతుర్దశభాషలకును సంస్కారములేమిచే వినియోగములేదని వ్యాఖ్యచేసి, అట్లే సంస్కారరహితంబుగాన తెన్గుగ్రామ్యంబునకును తెన్గునాటకములయందు ప్రయోగము కూడదని, గ్రామ్యము లేక నాటకరచనపనికిరాదనియు, ఆహేతువుచేత తెన్గునాటకములే కూడవనియు, అట్టి యాయభిప్రాయముచేతనే విన్నకోట పెద్దనాద్యాంధ్రాలంకారికులు తమచేసిన యాంధ్రకావ్య లక్షణ ప్రకరణములలో నాటకలక్షణమును మానినారనియు, వాదించుచున్నారు.

భరతాది శాస్త్రకారులు ప్రాచ్యాదులకు వినియోగము చెప్పియున్నారు. "ప్రాచ్యా విదూషకాదీనామ్" అని భరత విశ్వనాథులు. "యద్దేశం నీచపాత్రంతు తద్దేశ్యం తస్యభాషితమ్" అని దశరూపక సాహిత్యదర్పణములు, విభాషావినియోగ విస్తరమును ఈగ్రంథముననే భరతకారికలందుఁజూడుఁడు. మఱియు సాహిత్యదర్పణమునందు 432-వ యధికరణముంగనుఁడు. సింగభూపాలుఁడును పూర్వాచార్యోక్తము ననువదించెనేగాని విరోధింపలేదని ఏతత్పరిభాషావతారికవలనం దెలియుచున్నది. ఏషేత్యాదిపూర్వోదాహృతశ్లోకములకు అవ్యవహిత పూర్వములు:—

అథరూపకనిర్మాణ పరిజ్ఞానోపయోగినీ
శ్రీసింగధరణీశేన పరిభాషానిరూప్యతే,
పరిభాషాత్రమర్యాదా పూర్వాచార్యోపకల్పితా
సాహినౌరతిగమ్భీరం వివిక్షోర్నాట్యసాగరమ్.
ఏషాభాషావినిర్దేశ...

విరోధించినచోఁ బ్రామాణ్యమెట్లగును? కాన నిటంద త్త్వమే మన:—పూర్వపక్షీకృతవ్యాఖ్యసరిగాదు "పదునాలుగు విభాషలును సంస్కారహీనములగుటచేత ఉత్తమాదులకు తద్వినియోగము విహిత ముకాదు. మఱి యధములలోనే ఆయాదేశమువానికి ఆయావిభాష వినియోజ్యమని యెఱుఁగవలయును." అని కారికార్థము

హృషీకేశశాస్త్రికృతప్రాకృతవ్యాకరణ పీఠికలో:—

"Apabhramsa appears to be the general name of the following dialects, viz:—Nagara, Upanagara, Dravida (or Sindhi), Baitaliki, Abhiri."

దీనిక్రిందిజ్ఞాపిక:—

"It will be observed that the names of the different Prakriat dialects mostly refer to territorial divisions."

విభాషలన్నియు సంస్కారరాహిత్యముచే నిర్విశేషముగా నీచము లగుటవలన వానిని ఉత్తమ మధ్యమ పాత్రములకు వినియోగింపరా దనియు, అధమపాత్రములకే దేశ భేదానుసారముగా వినియోగింపవల సినదనియు కారికాతాత్పర్యము. ఈప్రమాణముచేత, సంస్కారము లేకయే ప్రాచ్యాది భాషలు (గ్రామ్యములు, అపభ్రంశములు) కవులచే నాటకములయందుఁ బ్రయోక్తవ్యములనియు, ప్రయుక్తములాయె నని యును, విశదముగదా.

ఈ దశరూపక కారికం గనుఁడు:—

దేశభాషాక్రియావేష లక్షణాఃస్యుఃప్రవృత్తయః
లోకాదేవావగమ్యైతాః యథౌచిత్యంప్రయోజయేత్.

ఇట "లోకాదేవ" యనుటం దిలకింపుఁడు. నాపైఁగినియక "యథౌచిత్య" మనుపల్కుంగూడఁ గటాక్షింపుఁడు. ఈవిభాషలు అప భ్రంశభేదములుగాఁ జెప్పఁబడియున్నవి గదా. విభాషావినియోగము దశ రూపకమునంబోలె రసార్ణవసుధాకరమందును కడుసంక్షేపముగాఁ జెప్పు

టకుఁ గారణమేమని యొకయా పము. ప్రతాపరుద్రీయములో పరిభాషను చెప్పనే చెప్పమికిం గా॥ ॥మేమని ప్రశ్నాకారముననే యుత్తరము. ఇట్లు సింగభూపాలీయ కారికోపన్యాసముచే గ్రామ్యము అవశ్య ప్రయోజ్యమని సిద్ధించినది.

విభాషలు సంస్కార రహితములని సింగభూపాలుఁడు వచించిన యీస్వారస్యము నరయుఁడు.

"ఆసాం సంస్కార రాహిత్యాన్నినియోగోనకథ్యతే ।
ఉత్తమాదిషు."

అనుమాటలో "ఉత్తమాదిషు" అనుటచే, అధములకుం బ్రయుక్తములగువిభాషేతర ప్రాకృతములు గూడ [లక్షణగ్రంథసనాథముల యయ్యును] సంస్కారరహితములే, అనఁగా సంస్కృతగ్రామ్యములే, యని సూచితమైనది. సింగభూపాలుఁ డిట సంస్కారహీనములని వ్యవహరించిన విభాషలకుంగూడ లక్షణగ్రంథము లేర్పడియున్నవి "లక్షణాని మమతాతపాదానాం భాషార్ణవే" అని విశ్వనాథకవిరాజు. హృషీకేశ శాస్త్రిగారు ప్రాకృతవ్యాకరణపీఠికలో నిట్లు వ్రాసియున్నారు:—

"Hemachandra, the great grammarian of the Prakrit dialects, treats of Apabhramsa only generally, but the authors of the Kalpalatika and other grammarians give separate rules for each of the different dialects that come under the term."

ఈరీతిని ఈభాష లిపుడు లక్షణగ్రంథసనాథము లయినను సంస్కారరహితములే; ఏలన, ఈలక్షణము స్వరూపకథనమాత్రముగాని విశేషాధాయకముగాదు. సంస్కారముపొందినచో నీభాషలెల్ల సంస్కృతమయగును. అట్లేభరతమునియు ప్రాకృతమాత్రమెల్ల సంస్కారరహితమనియే వచించినాఁడు:—

ఏవంతుసంస్కృతంపాఠ్యం మయాప్రోక్తంద్విజోత్తమాః
ప్రాకృతస్యతుపాఠ్యస్య సంప్రవక్ష్యామిలక్షణమ్.

ఏతదేవవిపర్యస్తం సంస్కారగుణవర్జితమ్
విజ్ఞేయం ప్రాకృతంపాఠ్యం నానావస్థాన్తరాత్మకమ్.

భరతముని తనకాలమున లక్షణగ్రంథములులేమిచే నట్లు చెప్పినాఁడనంచగదు. భరతమునియే యీప్రకరణమున ప్రాకృతలక్షణమును చెప్పియున్నాఁడు. లక్షణగ్రంథసద్భావమాత్రమున నివి సంస్కారవంతములుగావు. సంస్కృతేతరములయిన భాషావిభాషలకెల్ల నపభ్రంశసంజ్ఞ మహాభాష్యాది గ్రంథములలో వ్యవహృతమైనది. "ఏకస్యైవశబ్దస్య బహవోపభ్రంశాః। తద్యథాగౌరిత్యస్య గావీగోణీగోతా గోపోతలికేత్యేవమాదయోబహవోపభ్రంశాః"—మహాభాష్యము "శాస్త్రేతు సంస్కృతాదన్య దపభ్రంశతయోదితమ్"—దండి.

ఇందువలన, ప్రాకృతాది భాషా విభాషల నీచనీచతరత్వాది తారతమ్యము, వర్ణన్యూనత్వాధికత్వాన్యాదృశత్వములచే నివి సంస్కృతమున కెంతదవ్వయినవో దానింబట్టి యేర్పడినదనియు, సంస్కారహీనతాకారణముచేతనే యివి నీచాదిపాత్రలకుం బ్రయోగింపఁబడినవనియు, నడుమవచ్చినలక్షణము వీని ప్రయోగమునకు సాధకమేనియు బాధకమేనియుం గాదనియు విశదముగదా. ఇందువలన, పెట్టకతప్పని గ్రామ్యము నిషిద్ధమను హేతువుచే నాంధ్రనాటకములకు నాంధ్రాలంకారికు లొప్పరైరనుమాట యపాస్తమైనది. మఱియిందు విశేషమొకటికలదు.ఈగ్రంథమునందే మఱియొకచోట నుపన్యస్తమైనను ఇట ప్రసక్తివిశేషము చేఁ జెప్పవలసివచ్చినది. ఏమన,ఈపూర్వపక్షమే గ్రామ్యములేనిది నాటకముకాదని యొప్పుకొన్నది గదా. పూర్వపక్షుల యీయుక్తిచేతనే గ్రామ్యరహితనాటకములెల్ల రూపుమాసినవిగదా. గ్రామ్యవిరాజితములగుతత్ప్రతిపక్షనాటకములే సరియైనవనియు సిద్ధాంతితమైనదిగదా.

## గ్రామ్యనిషేధానుమానాభాసప్రకారము.

ఉపలభ్యమానము లయిన యాంధ్రలక్షణగ్రంథములందు [కావ్యాలంకారచూడామణి కావ్యాలంకారసంగ్రహములందు] నాటకలక్షణము

లేమిచే నాంధ్రభాషలోఁ దద్రచననిషిద్ధ మని వాదించువారి కుత్తరము.

నరకవిజయ వ్యాయోగకారుఁడు సాహిత్యరత్నాకరములో నాటకలక్షణము చెప్పలేదు, ప్రసన్నరాఘవనాటకకర్త చంద్రాలోకములో దానిం జెప్పలేదు అట్లే కావ్యాలంకార సరస్వతీకంఠాభరణ కావ్యప్రకాశ వాగ్భటాలంకారాలంకారసర్వస్వ కావ్యాదర్శాది సంస్కృతగ్రంథములలో నాటకలక్షణము లేదు. రసతరంగిణీ రసగంగాధరములయందును లేదు ఈగ్రంథముల రచయితలకు సంస్కృతనాటకము లుండఁగావలసియేని ఉన్నను వానియందు భాషాభేదములు కూడవని యేనియు నభిప్రాయమా? వారే కొందఱు నాటకములు రచియించినారుగదా? ఒక్కనికే నాటకములు కూడుననియు కూడవనియు నభిప్రాయద్వయమా? నాటకలక్షణమును తమకుముందుగానే యొకకొందఱు కగము చక్కఁగఁజెప్పియున్నందునను గ్రంథవిస్తరభీత్యాది కారణములచేతను పూర్వోక్త సంస్కృతకవులు తమ లక్షణగ్రంథములందు దానిని మానిరనియు, విశేషములు దెల్పఁగలిగినవారు తమగ్రంథములందే వానిని దెల్పుచుండిరనియు నూహ్యమైయున్నది ఆంధ్రమందు అలంకారశాస్త్రగ్రంథములేయరుదు; నాటకములు లేనందున తల్లక్షణోపదేశము, పుట్టునను నిశ్చయములేక పుట్టఁబోవుపుత్త్రుని నామకరణవిచారణమువోలె, నప్రసక్తప్రాయమైనది; ఇపుడు నాటకరచనలచే సుప్రసక్తమైనది; గావున,నిపుడు దశరూపకము తెన్గింపఁబడినది.

మఱియు ఆంధ్రములో రూపకలక్షణరచన ఒకానొక కారణముచే ప్రాచీనుల కశక్యమైయుండెను. తెన్గు లక్షణగ్రంథములలో నాయథ్యాయమును మానుట కదియేముఖ్యకారణమైయున్న నుండనోపు. అదియే మన:__రూపకలక్షణమందు 28 రూపకభేదములనుండి లక్ష్యములు చూపవలయును, అట్టివి తెన్గునలేమిచే దేవభాషారూపకములనుండియే చూపవలసివచ్చును. సింగభూపాలీయ దశరూపక దర్పణప్రణాలికంగనుఁడు. మఱియు నీరూపకభేదముల స్వరూపములు లోకసిద్ధలక్ష్యైకగమ్యములు.

23 దింటిని లక్షణకారుఁడేరచించిచూపుటకు విస్తరభీత్యాదులు కారణము గానోపు. లక్ష్యమెల్లమాతృభాషలో నేర్వవలసియుండఁగా లక్షణమాత్రము తెనుఁగునఁజెప్పుట యనావశ్యకమనియు, మాతృభాషాలక్ష్యములు తెలిసినవారికిది యనావశ్యకమయినట్లే, తెలియనివారికి బోధపడదనియు నుపయోగపడదనియు, ఆంధ్రలక్షణగ్రంథములలో దానినిమానివేసినారు. ఇపుడాంధ్రభాషలోనున్న దశరూపకంబును అపేక్షితవ్యాలక్ష్యసంపత్తివిరహితంబగుటచే నిష్ప్రయోజనప్రాయమై యున్నది.

అప్పకవీయమున నిట్లున్నది:—

గీ. ఉత్తముఁడులక్ష్యలక్షణవృత్తవేది
పరఁగుమధ్యముఁడనలక్ష్యపద్యవేది
సొరిదినధముండులక్షణశ్లోకవేది
లక్షణజ్ఞులకివియపోలక్షణములు.

క. తొలుతను లక్షణమాత్రం
బు లెఱింగి పిఱుంద లక్ష్యములు దెలియంగా
వలయును గావున లక్షణ
ములు లక్ష్యంబులును బాఠముగఁజేయఁదగుఁ.

'<u>లక్ష్యములు</u> పాఠముసేయఁదగుఁ' అన్నారుగదా? తెనుఁగున నున్నంగదా చేయనగుఁ? దీనివలన తెలిసినదిగదా ఆంధ్రకవులు రూపకలక్షణాధ్యాయమును రచింపమికి నొకకారణము?

మఱియు, పూర్వోక్త కావ్యాలంకారచూడామణి సరసరాజీయములు లేనప్పుడు కవులు వేనిని పాటించిరి? ఆంధ్రగ్రంథముల వ్యాఖ్యాతలుకూడ వీనినుండి యుదాహరింపక చంద్రాలోకాది సంస్కృతగ్రంథములనుండియే యుదాహరించుటంగనుఁడు. పూర్వము గీర్వాణభాషలోనే మనవారు అలంకారమును నేర్చుచుండిరి. ఈయాంధ్రప్రకరణములు లక్షణస్వరూపసమగ్రచర్చా ధురంధరములుగామిక్షేత శాస్త్రోప

దేశవిషయమందు ఎన్నఁడును గణనకెక్కనివారయెను. ఈశాస్త్రము తెలుఁగునవర్ధిల్లమికి అదియొకకారణము. మఱియు ఈరెండుగ్రంథములలో లేనివియు చంద్రాలోకమందుఁ గలవియునగు లలితాద్యలంకారములు ఈతెనుంగునంబనికిరావా? ఇప్పటికిని ఈభాషయం దలంకారశాస్త్రము ఆరంభావస్థలోనున్నది. కాన, నిందులేనిది ప్రమాణమా కాదా యను చర్చ పనికిరాదు. పోనీ, చర్చకేమిగాని, ఇందులేనిది ప్రమాణము కాదనుటసరిగాదు. లక్షణాభావమువలన నిషేధము సూచితమనువాదము మందమని ఈయుపన్యాసముచేత విశదముగదా.

"ఏలక్షణగ్రంథములంబట్టి సంస్కృతనాటకముల నాంధ్రీకరింపవలసినది?" అనియొకప్రశ్న వార్తాపత్రికలం దగపడుచున్నది ఈప్రశ్నకు అవకాశము లేదు. నాటకాంధ్రీకరణమునకు లక్షణగ్రంథము వలయు నేని, ఇతిహాసపురాణ మహాకావ్యాద్యాంధ్రీకరణమునకును లక్షణగ్రంథము వలసియేయుండును. అదిలేక నాటకగ్రంథములం దెనిఁగించుట దుష్టమేని, అదిలేక భారత రామాయణ నైషధాదిగ్రంథముల దెనిఁగించిన పెద్దలు తప్పుసేసినవార గావలయు, బళిబళి ! ఇందుగ్రామ్యము పెట్టవలయునుగాన దీనికి లక్షణగ్రంథములు వలయునందురేని, అందు రోఁతకథలు బూతుకథలు కలివిడంబనములును చొచ్చునుగావున వానికిని లక్షణగ్రంథము లుండవలసినదే. లక్షణగ్రంథములు లేనిచో నాంధ్రీకరింపరాదనుటకుం బ్రమాణమేమి? కృష్ణసారములేనిదేశమున బ్రాహ్మణుఁడు వసింపరాదన్నట్లా?

ప్ర॥ ప్రతాపరుద్రీయమునకు నాంధ్రముగదా నరసరాజీయము? (దానంగల నాటకలక్షణమిందుందవ్యక్తము.)

ఉ॥ అట్లని మీతో మూర్తి చెప్పినాఁడా?

ప్ర॥ మఱి నరసరాజీయములో నాటకలక్షణము లేదేమి?

ఉ॥ అందులో కావ్యాలంకారచూడామణి యందుంగల ఛందోలక్షణము లేదేమి ?

మఱియు నాటకములుగూడవని యాంధ్రకవులకెల్లం దాత్పర్యమేని నన్నయాదులలో నొకరేనియు నట్లునిబంధన చేయలేదేమి? అట్టి నిబంధనసేయు నధికారమెవరికేనియుండునా? మీరుమెచ్చునట్టి యేయోగుచేతనేనియు నిక నాంధ్రనాటకములు వ్రాయఁగూడదని యిపుడొక నిబంధన సేయించిచూడుఁడు. ఏపాటి చెల్లునో తెలియును. అట్టి నిబంధనయును లేదు, నిబంధనాధికారంబును లేదు. అటుగానిచో, నాటకములు పుట్టవలసినదే, ఈభాష నాశము కావలసినదియే, అని యాపెద్దలకు ఆక్రోశము కాఁబోలు! కాదు, కాదు, నాటకములుపుట్టవలసినవియే, ఈభాష యలంకృతకావలసినదియే యని వారియనుగ్రహము.

## నాటకలక్షణమునకు ప్రమాణగ్రంథములు.

“ఆంధ్రనాటకము లే లక్షణగ్రంథములంబట్టి రచింపవలసినవి? ఆంధ్రమున తల్లక్షణగ్రంథములు లేనందున ఆంధ్రనాటకనిర్మాణమును శాస్త్రమొప్పునా? ఆంధ్రనాటకములందు గ్రామ్య ముపయోగింపఁగూడదని సింగభూపాలీయమువలనం దెలియుచున్నది, వానియందు వస్త్రధారణము చూపరాదని ప్రతాపరుద్రీయమందున్నది. నాందిలో 12 పదము లుండవలయునని దశరూపకము, అట్లులేమి నీనాందితప్పు.”—ఇత్యాది వాదములతో పత్త్రికలు నిండుచున్నవిగదా.

ఇట, “లక్షణము లేదనుచునే శాస్త్రమొప్పద” నుట ఏటిమాట? లక్షణమే శాస్త్రము, శాస్త్రమే లక్షణము. ఈప్రశ్న వంధ్యాపుత్త్రుని రాజయోగమును జోస్యమడిగినట్లున్నది.

మఱి యీ కావ్యాలంకారసంగ్రహమును కావ్యాలంకారచూడామణియు లేనప్పుడును ఆంధ్రమునకు అలంకారమువలసియుండెను గీర్వాణభాషలోనిదే ప్రాచీనాంధ్రకవులచే పాటింపఁబడెను. ఆక్షేపించుటకు ఏలక్షణగ్రంథములు ప్రమాణమో రచనకును ఆలక్షణగ్రంథములే ప్రమాణమని వేఱచెప్పవలయునా? అది సంస్కృతమున సిద్ధముగానుండఁగా ఆంధ్రమునలేమి యొకలోపమా? సర్వత్రవిశేషాకారమైన యేత

ద్భాషాలక్షణమే నన్నయభట్టీయ వికృతివివేక కవిశిరోభూషణాది రూపముల దేవభాషనుండఁగా, సర్వత్ర సామాన్యస్వరూపంబును, విభాషారూపైకదేశమాత్రమందు సజాతియాతిదేశాపేక్షియు నగు రూపకలక్షణము గీర్వాణభాషయందున్న నాంధ్రమునకుం గొఱగాదా ? ఆంధ్రభాషలో లేమిచే మన్వాది ధర్మశాస్త్రములుగూడ ఆంధ్రులకు ప్రమాణము కావా? ఇంగిలీషుభాషలోని పీనల్కోడ్డుప్రకారము తెన్గుదోషికి దండన విధింపక వదలివేయుదురుగావలయును ! సర్వదేశ జన భాషలకును నిర్విశేషములగు విషయములు ఏభాషయందున్నను మఱి యేభాషవారికే నియుం బనికివచ్చును. ఇంగిలీషుగణితము తెలుఁగంకెలకు పనికిరాకపోదు.

పూర్వపక్షులు ఆక్షేపించుటకుమాత్రము సంస్కృతమందలి రూపకలక్షణమును పాటించుటయు నాటకరచనకు ఉల్లంఘించుటయు నేల యనిన:—పాటించుట ఒరులనాటకముల దూఱుటకు, ఉల్లంఘించుట తమయు తమమిత్రులయు నాటకములను గాచుకొనుటకు.

మఱియు వీరిబుద్ధి పరనాటకదూషణోత్కంఠచేఁగల్గినతబ్బిబ్బులో నిజ నిజమిత్రరక్షణోద్యోగరూపనిరోధముంగోలుపోయిస్థితస్థాపకమర్యాదచే ప్రకృతిసిద్ధమైనసంస్కృతలక్షణగ్రంథములనే తడవినది. ఇట్లు ఆసింగభూపాలీయమే, ఆప్రతాపరుద్రీయమే, ఆదశరూపకమే, ఇంక గీర్వాణభాషాకవులకు ఏయేసంస్కృతగ్రంథములు ఈవిషయమునం బ్రమాణములో, అవియే అవియెల్లను, మనకును ఈవిషయంబునం బ్రమాణములని పూర్వపక్షులవాదముచేతనే సిద్ధాంతితమైనదిగదా.

మఱియు ఆధునికలక్షణకారులు నాటకలక్షణములు రచించి యీభాషయందలి యీకొఱంతను దీర్పవలయునను ఘోషయును ఈగ్రామ్యనిషేధవాదులే పెట్టుచున్నారు. లక్షణాభావముచే నిషేధము గమ్యమయినయెడల నిఁకలక్షణకరణ ప్రసక్తియెట్టిది? మధ్యవారును ఆకొఱంతఁదీర్ప లేదనుఘోషకు నిదియ యుత్తరము. ప్రాచీనులు అలక్షణముచే నిషేధముందెల్పిరేని, తర్వాతివారు తన్మతవిరుద్ధముగా లక్షణమెట్లు

చేయుదురు? వారినిషేధము వీరికిం బ్రమాణము కాదేని, వారు నిషేధించిరని యీయడవి మొత్తుయేల? వారిది వీరికి ప్రమాణము కాదేని, వారిదియు వీరిదియు మన కెట్లు ప్రమాణములు? మన మిరువురికిని బెబ్బె చెప్పవచ్చునుగదా. అంతట నెల్లవారికిని వారియిచ్ఛయే లక్షణము. అది సమ్మతము గానేరదు. ఈ కావ్యాలంకారసంగ్రహ కావ్యాలంకారచూడామణులు ప్రమాణసర్వస్వ మనుటకంటె, వీనిని ధిక్కరించుట యనుభ్రమతోనేని అది లేకయేని, కొఱఁతలుతీర్చుటకంటెను, కొఱఁతలు తీర్పఁబడునందాఁక నాటకరచనమానుటకంటెను, వీనికేది ప్రమాణసర్వస్వమో ఆ సంస్కృత లక్షణగ్రంథ సముదాయమే మనకును బ్రమాణసర్వస్వమగుటయే న్యాయ్యము. సర్వన్యాయములచేత నదియే సిద్ధాంతము. అంకస్థల పాత్రభాషితరూపవిభజనమాత్రమున నాటకము కానేరదు

ఇప్పటి నవీనాంధ్రనాటకములనుండి లక్ష్యముదాహరించుచు ఎవ్వరేని నూతన లక్షణగ్రంథము నిపుడు తెన్గున రచియింపరాదా యందురేని, ఈనవీన నాటకములలో నాంధ్రీకరణమగు నొకకొన్ని, 28-రూపక భేదములలోను ఒకటి రెండింటికే, లక్ష్యములగునుగాని, కడమ భేదములకు లక్ష్యములు గావు. కడమ నూతననాటకములు ఈ 28-లో నొందునుంజేరక బ్రహ్మేశానాదిబోధిత చతుర్వేదోద్ధృత భరతమహర్షిప్రణీత నాట్యశాస్త్రమర్యాదకు వెలియైయున్నవి. కాన వీనింగొనిచేయు లక్షణము సరిపడదు. భరతలక్షణసమ్మతమగు నాటకము, ఒకటి, ఒకానొకటి యున్నను, అది వీనినడుమ బొమ్మచెముడునడిమి గొజ్జంగి పువ్వువలె నల్పసారులకు అలవడకయున్నది. అట్టిదియు 28-లో నొకతెగయేగదా; కావున సలక్షణ రూపకములు భాషలో సమృద్ధిగాఁ బ్రబలువఱకును తెన్గున సుబోధలక్షణ గ్రంథరచన అశక్యము.

రూపకరచనానుజ్ఞ.

పూర్వపక్షులు ఏగ్రంథములచే నిషేధమును అనుమానించిరో వానియందే వాచ్యవ్యంగ్యభంగుల రూపకరచనానుజ్ఞ చదువఁగలవారికి అలవడుచున్నది. అప్పకవీయమునం దిట్లున్నది:—

గీ. దేవ భూసుర ధరిత్రీతలేంద్ర
సచివ కంచుకి విట విదూషక విరక్త
వారయోషి న్నృపామాత్యవనితలందుఁ
జెప్పఁదగు సంస్కృతము సుధాసింధుశయన.

సీ. క్షపణజైనాదిక కర్మహీనులకును
భామాజనులకును బ్రాకృతంబు
క్షితి వైశ్యశూద్రప్రభృతిమధ్యమాధమ
జాతులకెల్లను శౌరసేని
ధీవరలుబ్ధకాదివినీచజాతుల
మానవులకునెల్ల మగధభాష
మొగిఁబిశాచాసురముఖ్యులకెల్లఁ బై
శాచికానామభాషాద్వయంబు.

గీ. పతితచండాలయవనాదిపరమనీచ
జాతినరుల కపభ్రంశ మీతెనుంగు
సీమవారికి నాంధ్రంబు సెప్పవలయుఁ
గావ్యనాటకముల గోపికాభుజంగ.

'దేవభూసుర' మొదలు 'అపభ్రంశ' మను వఱకుంగల ప్రకరణము శ్రవ్యకావ్యమున కన్వయింపదు. నాటకమునకుమాత్ర మన్వయించును. 'ఆంధ్రంబు సెప్పవలయు' ననుమాటయు సంస్కృతనాటకమాత్రమునకే యన్వయమగుననంజనదు. అట్టినాటకము లోకములో లేదు. ప్రతాపరుద్రీయమందలి ప్రతాపరుద్రకల్యాణనాటకముగూడ నట్టిదికాదాయెను. కనుక ఆంధ్రవినియోగము గీర్వాణభాషానాటకములకై చెప్పినమాట గాదు. ఆంధ్రేతరభాషలెల్ల నీప్రకరణమున జాతిభేదములకుఁ జెప్పఁబడినవి. ఆంధ్రముమాత్రము దేశముంబట్టి చెప్పఁబడినది. తెలుంగుసీమవారు పూర్వోక్త భూసురాదులయందుఁ జేరియేయున్నారు. కావున ఒక్కనికే సంస్కృతాద్యన్యతమమును ఆంధ్రంబును అనువిప్రతి

షేధ మపరిహార్య మగును. కాన నేకనాటకమందు సంస్కృతాదిభాషల తోఁగూడ నాంధ్రమునుగూడఁ బెట్టుమని యభిప్రాయ మనువాద మప్రాస్తమైనది. మఱియు:

నబర్బరకిరాతాన్ధ్ర ద్రవిడాద్యాసుజాతిషు
నాట్యయోగేప్రకర్తవ్యం కావ్యంభాషాసమాశ్రయమ్.

అని భరతముని యాంధ్రమును సంస్కృతనాటకములలోఁ జెప్ప రాదని శాసించియున్నాఁడు. సర్వలక్ష్యకారులు నట్లు నడచుకొన్నారు. అట్లుండ నప్పకవి తద్విరుద్ధముగాఁ జెప్పెననుటీక యొప్పఁదగినదిగాదు. మఱి తత్త్వార్థ మేమన:—ఇది భాషాష్టకోత్పత్తిప్రకరణమున కుపసంహా రముగావున అష్టభాషలకు వినియోగము సెప్పఁబడినది. అష్టమమయిన యాంధ్రమునకు ఈతెనుఁగు సీమవారికై కావ్యనాటకములందు విని యోగము అని యభిప్రాయము. అగపడుచున్నదా, ఆంధ్రనాటక రచ నానుజ్ఞ? లేదు లేదనుఘోషకు సమాధాన మిఁక మీరే చెప్పఁడు.

రసము కిన్నిష్ఠమను ప్రశ్నకు ఉత్తరముచెప్పుచు నప్పకవి దృశ్య కావ్యముల యందు సామాజికనిష్ఠముగాని నటానినిష్ఠముగాదని యిట్లు తెల్పినాఁడు:—

సీ. తద్రసంబంతయుఁ దనరుఁగావ్యములందు
నాట్యంబులందు ననారతంబు
వినునార్యులకుఁ గావ్యవృత్తంబులను గనుఁ
గొనురసజ్ఞులకు నర్తనములందుఁ
గలుగుఁగానిరసంబు గలుగదారోప్యంబు
గావున నటియించు కాంతలందు.

ఆంధ్రమున నాట్యమేకూడదేని ఆంధ్రనాటకప్రయోగ ద్రష్టృ రసజ్ఞ సామాజికులు వంధ్యాపుత్త్రులేగదా. కాన నిట నీనాట్యప్రస్తావము ఆంధ్రనాటక నిర్మాణప్రచోదనమేకాని తన్నిబర్హణము గాదు. గీర్వాణ విద్యార్థులకై యిట నప్పకవిచెప్పెననుట, భోజనపంక్తిలో వడ్డించినపంచ

దార చీమలకోస మన్నట్లున్నది. అప్పకవి యీరీతిని నాటకరచనను వాచ్యగమ్యభంగులం బ్రోత్సాహపఱచినాఁడుగదా. నరసభూపాలీయకారుఁడును ఇట్లే రసము దృశ్యకావ్యములలో సామాజికనిష్ఠ మనుటం బరికింపుఁడు.

మ. రమణీయోల్బణతాసమేత మగునీరత్యాదిభావాబ్ధిలో
సమరంబుట్టుచునున్న చుందగుఁ దరంగారూఢిసంచారిసం
ఘము లేతత్ప్రతిపన్నమౌ రసము దత్కాలంబునందైన స
త్యము రామాదులయంద నాట్యమున సభ్యావాసమై భాసిలున్.

ఇందిట్లు అనుజ్ఞగమ్యమై యున్నది.

మఱియు కావ్యాలంకారచూడామణియందును వక్ష్యమాణఫక్కిని ప్రచోదనవాచ్యగమ్యభంగులం బ్రబలముగానున్నది.

క. వినువారికిఁ గనువారికిఁ
దనరువిభావానుభావ దర్శనచయముల్
ఘనరసపోషకములుగాఁ
జనుఁగవితానాట్యములఁ బ్రసన్నాకృతులై.

తే. ప్రౌఢలకుఁ గావ్యములయందుఁ బొందురసము
ద్రష్టలకు నాట్యములయందుఁ దనరు రసము
స్ఫుటవిభావానుభావసంఘటనచేత
సాత్త్వికవ్యభిచారి సంసక్తిచేత.

క. రసమారోప్యంబగుటన్
బొసఁగదు నాట్యములయందుఁ బొల్పగుఁ దత్త
త్ప్రతిసరస్మరణముచేతన్
వెససామాజికులయందు వేడ్కకునెలవై.

తే. పంచవిధభావకలితప్రపంచమెల్లఁ
గలసి శృంగారరసపోషకంబ యంద్రు

క్రమముతోడఁ బ్రయోగసంగతియొటెంగి
కావ్యనాటకములఁ గూర్పఁగనుటయొప్పు.

తే. అట్టికావ్యంబు త్రివిధమై యతిశయిల్లు
నవనిఁ బద్యమయంబు గద్యాత్మకంబు
పద్యమయ మొప్పు ఛందోనిబద్ధమగుచు
గద్యమయ మొప్పు వాక్యసంకలితమగుచు.

క. ఆపద్యగద్యకృతములు
రూపకములునాటకములు రూఢములగునా
రూపమచంపూకావ్యత
ప్రాపించును నాటకములు బహుళములరయన్.

తే. సర్గబంధంబు కావ్యంబు సంస్కృతమునఁ
బ్రాకృతంబున నాశ్వాసభాసురంబు
నాటకములెల్ల నంకసనాథకములు
గద్య ముచ్ఛ్వాసలంబ కాంకంబ యండ్రు.

"కావ్యనాటకములఁ గూర్పఁగనుటయొప్పు"—ఇప్పటికేని నిషిద్ధమనుఘోష యడంగునా!—ఇట్లు పెద్దనాదులు నాటకరచనసేయఁబ్రేరించియు తల్లక్షణమును త్యజించుటచే దానిని తగినయాకరణములనుండి యెఱుంగునది యనుట వారిహృదయమని విశదపడదా! ఈలక్షణమును మానుటకు బహుళత్వంబు ఒకకారణమని పెద్దనసూచించుటం గన్నారుగదా.

## ఆంధ్రలక్ష్యాభావకారణము.

ఇట్లు లక్షణకారానుగృహీత మయ్యును, నాటకము, తెనుఁగుఁ గవులచే పరిగృహీతము కాలేదేమి? కానందులకు కారణమొకటి—మనవారు మేఁకలమందస్వభావమువారగుట. "గతానుగతికోలోకః." మఱి యింతమాత్రమున వీరు ఆచరించిన దెల్ల నంగీకృతమనియు అంగీకృత

మెల్ల వీరు వ్రాసిరని యూఁదలంపఁదగదు. చముడప్పవలె నందఱేని వ్రాయుచుందురా? గీర్వాణభాషయందు రాజతరంగిణీ హర్షచరిత్రాద్యాఖ్యాయికలు గలవుగదా, తెన్గునం గూడవా? దేవభాషయందు గద్యరూపకథలు కాదంబర్యాదులు గలవుగదా? తెన్గున నట్టిగద్యములేవి? తెన్గునం గూడవా? కూడవేని, ఇపుడు కవిచరిత్రలను, దేశచరిత్రలను, కాదంబరీసారసంగ్రహాదిగ్రంథములను వ్రాయువారు భారతికి ఎగ్గొనర్చినవారా? మనవారు మేఁకదాఁటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి తర్వాతం బ్రబంధంబుల విసిగి యిపుడు అన్యములందొడంగినారు. మఱియు గీర్వాణనాటకముల నెఱింగియు హూణనాటకములం జదువవఱకు నాటకముల వ్రాయరైరి. గీర్వాణకథల నెఱింగియు హూణనవలలం గాంచినదనుక నవలలపయిం బడరైరి. మఱియు గద్యకవన మొకప్రజ్ఞ కాదఁట. ఆభావముచే నవలలు లేకపోయినవి. నాటకములు వ్రాయమికిని అట్టి కారణమే యొకానొకటిగలదు. కావ్యాలంకారచూడామణి:—

చ. వినుతయశంబునం గలుగు విశ్రుతనాకనివాస, మయ్యశో
జననము శ్రవ్యకావ్యముల సంగతినొప్పగు; శ్రవ్యకావ్యముం
దనరుఁ గవిప్రభావమునఁ; దత్కృవిస్మృతిలేని రాజులే
పునవిహరింప; రవ్విభులు పోయినజాడ లెఱుంగఁబోలునే.

మ. కవిసుసిద్ధపదంబు భావరసవిఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రవ్యంబుం జతుర్వర్గసం
భవసద్మంబును నైనకావ్య మిలనాపద్మోద్భవస్థాయియై
కవిసంస్ఫూర్తియు దాతృకీర్తియుఁ దగంగల్పించు నెల్లప్పుడున్.

ఈవ్రాతంబట్టి చూడఁగా,—మనవారు శ్రవ్యకావ్యమాత్రమే సప్తసంతానములలో చేరినదనియు, ఆముష్మికాభ్యుదయప్రదమనియు, దృశ్యకావ్య మట్టిది కాదనియు, తలంచిరని యొకరహస్యము వెలువడుచున్నది. మహాకవులెవ్వరును రూపకలక్ష్యరచన సేయమికిది ప్రథమ కారణము గానోపు. ఈరెండును బాహుళ్యమును లక్షణరచనను అడ్డ

మైనవి. "సాహినౌరతిగమ్భీరం వివిశో ర్నాట్యసాగరమ్."

మఱియు పూర్వులు రూపకరచనసేయనేలేదనుట సరిగాదు. శ్రీనాథుఁడు వీథీనాటకమురచించెనని ప్రసిద్ధముగదా. ఆతఁడు బూతులు చేర్పకయుండిన నప్పటినుండియే నాటకములెల్లుకొని యుండును. అన్యులును పూర్వులు నిజసత్త్వానుసారముగ నాటకములను రచించియేయున్నారు. సంతానంబో కాదో, దృష్టబహుప్రయోజనంబుగావునను, ముఖ్యముగా ఆనందనిష్యందిగావునను, పెద్దనాదిలక్షణకారులచే ననుజ్ఞాతంబుగావునను, మఱియుఁ ప్రబంధములతోఁ బ్రాణమువిసిగిపోయినది గావునను; నాటకము మనకు ఉపాదేయమే:—

## ఓఢ్రాదిభాషాగ్రహణదూషణము.

కారణవిశేషముచే నాంధ్రగ్రామ్యము నొల్లని కొందఱు ఆంధ్రనాటకములలో సంస్కృతనాటకములందలి మహారాష్ట్రీ శౌరసేన్యాది షడ్విధప్రాకృతములకు బదులుగా ఓఢ్రము, కన్నడము, హిందుస్థానీ, అఱవము, ఇంగిలీషు, సంస్కృతము అను నాఱింటిని ప్రయోగింపవలయునని యభిప్రాయపడియున్నారు. వారే ఆంధ్రులకు ప్రాయికముగా తెనుఁగుతప్ప వేఱుభాష రాదనియు సెలవిచ్చియున్నారు. అట్టి నాటకముల ప్రభావాతిశయముల నొకకొన్నిటిం దెలిపెద:—

i. మానిసియైనవానికి ఆనాటకము అర్థముగాకపోవుట.

ii. కవికి ఈయోఢ్రాదులను నేర్చుటకు వలయు (6 × 2=) 12, ఒండె, (6×3=) 18 సంవత్సరములలోపల, తెన్గు బొత్తిగాచెడిపోవుట, విస్మృతంబునగుట, వానితెన్గువినుటకేనియు ననర్హమై యసహ్యమగుట.

iii. ఈదేశభాషలను సలక్షణముగా నేర్చుటకు ఈపరదేశికవికి మూఁడేసి సంవత్సరములు చాలవుగాన, వీనికి తదీయగ్రామ్యమే పట్టుపడునుగావునను, ఈభాషలగ్రామ్యమే మన తెన్గునాటకములం బ్రయోక్తవ్యమగును. ఆంధ్రనాటకములలో నాంధ్రగ్రామ్య ముండరాదఁట ! ఓఢ్రగ్రామ్య ముండవచ్చునఁట !

iv. మఱి వారే చచ్చుడిభాష (అనఁగా ఒడ్డెమాలల యోఢ్రగ్రామ్యము) తెన్గునాటకముల నీచపాత్రములకుం బ్రయోక్తవ్యమని సెలవిచ్చియున్నారు. ఈరీతిని ఆంధ్రనాటకములలో, ఆంధ్రపండితుల యాంధ్రగ్రామ్యమునకు, ఆంధ్రులైన బ్రహ్మక్షత్త్రియవిట్ఛూద్రుల యాంధ్రగ్రామ్యములకును, లేని యీభాగ్యము ఈచచ్చుడివాండ్రగ్రామ్యమునకుం గల్గుట వీరి యేసుకృతమునకు ఫలమో?

v. ఇట్లేనియు నీచనీచతరాది భేదముల నిర్వహణ మెట్లు? ఓఢ్రము నీచమా అఱవము నీచమా?

vi. ఇట్లేనియు భాషలకు ప్రతినిధులు కల్గెనేగాని విభాషలకుం బ్రతినిధులేవి ?

vii. ఆంధ్రుడైనభర్త తెన్గు, ఆంధ్రురాలైనభార్య అఱవము, ఓఢ్రము, హిందూస్థాని, కన్నడము, ఇంగ్లీషు, చచ్చుడిభాష, ఇంతియకాని తెన్గుపలుకఁగూడదు. అట్లేఆంధ్రులగు వీరభటాదులును తెన్గునోట నుచ్చరింపఁగూడదు.

మ. నిజదేశంబులవేషభాషలపయి న్నిత్యాభిమానాఢ్యులై
ప్రజమెచ్చన్ రసలుబ్ధబుద్ధులగుచుం బ్రాజ్ఞుల్స్వదేశ్యంబులే
నిజ మంచున్మఱి యన్యదేశములవాని న్మెచ్చరెప్పట్టునన్
గజరాజావన ప్రస్ఫుటార్థరసముల్గావంచు నెప్పట్టునన్. అప్పకవి.

viii. ఇంకొకయద్భుతమున్నది. ఈపరిభాషలో సంస్కృతము ప్రాకృతస్థానీయమైనది. కాన, కణ్వుఁడు తెన్గు, శకుంతల సంస్కృతము. రాజు తెన్గు, తలారివాఁడును చెంబడివాఁడును సంస్కృతము.

ix. మఱి యీయోఢ్రద్రావిడ హిందూస్థానీ కర్ణాటాంగ్లేయ చచ్చుడ్యాదిభాషలను ఆయాలిపులనే ముద్రింపవలసినదా? ఆపక్షమున ముద్రణ మసాధ్యకల్పమే, ఈయచ్చుఁగూటములు పనికిరావు. మఱియు నట్టిగ్రంథము నాంధ్రులెవ్వరు చదువనేర్తురు? తెన్గులోలేనివర్ణములు

కొన్ని యీభాషలంగలవు. వానిగతియేమి? నాటకమెల్ల ఇంగిలీషులోనే స్పెల్లావించి ప్రింటొనర్పవలయునా ?

X. మఱియు, నాంధ్రనాటకముల ప్రాకృతస్థానమున నోఢ్రాది భాషల నతిదేశించుటకుం గారణముగా, సంస్కృతముతోడ ప్రాకృతములకుఁ గలసంబంధమే ఆంధ్రముతో నోఢ్రాదిభాషలకుం గలదని తలంచుటకును నేర్పుటకును—సంస్కృత ప్రకృతిప్రత్యయములకే ప్రతినియత వర్ణవిపర్యాసాద్యుపాయములచే ప్రాకృతములు నిష్పాదనీయములయినట్లు, ఆంధ్రప్రకృతిప్రత్యయములకే ప్రతినియత వర్ణవిపర్యాసాదికములం గావించుటచేత నిష్పాదనీయములా ఈయోఢ్రి హిందూస్థాన్యాంగ్లేయ ద్రావిడాదిభాషలు? అనఁగా ప్రాకృతాదులు సంస్కృతముయొక్క యసంస్కృత (ప్రాకృత) రూపము లయినట్లు ఈయోఢ్రాదులు ఆంధ్రముయొక్క అసంస్కృత (ప్రాకృత) రూపములా? అట్లయినంగదా అవియెల్ల సంస్కృతభాషణులకుం దెలిసినట్లు, ఇవియెల్ల నాంధ్రభాషణులకుం దెలియును? ఇట్లుండుటంబట్టి, సంస్కృతనాటకములందుఁ బ్రాకృతములచే నగుకార్యము తెన్గునాటకములందు ఓఢ్రాంగ్లేయాది భాషలచే నెంతమాత్రమును గానేరక పైగా మహానర్థ పరంపరకలుగుచున్నది. సంస్కృతనాటకములందు తదీయాసంస్కృతరూపములచే నైనప్రయోజనము,ఆంధ్రనాటకములయందు తదీయాసంస్కృతరూపములయిన గ్రామ్యములచేఁ గావలయుఁగాని తక్కొండొకటనెల్లనియు నగునా?

xi, మఱియు నాటకము లాడువారు ఇన్నిభాషలు నేర్చుకొనుటకై ఎన్ని సంవత్సరములు పాటుపడవలయునో? కవి యంతప్రతిభావంతులు గారుగదా? కాన వీరికి 6×5=30 సంవత్సరములు గావలసియుండును. దేశాంతరవాసము 20 ఏండ్లప్పుడారంభమాయెనేని, 50 సంవత్సరముల వయస్సునకేగాని వీరు ఇట్టినాటకము చదువను ఆడను పనికిరారు. ఇట్లు పరభాషలను నేర్చు కాలములో అమ్మను నాయనను అప్పుడప్పుడు చూడవలయును గావునను ఈలోపల పరమపదించిన తమయాంధ్రభాష

ను మఱలమఱల జ్ఞప్తి చేసుకొనుచుండవలయుఁగావునను, అందుకై భాష కొకసంవత్సరముగా 6 సంవత్సరముల నిర్ణయము. అప్పటికి 56 ఏండ్లయినవి. సర్కారుకొలువునకు 55 ఏండ్లకే పనికిరాఁడు. కడమ 4 ఏండ్లను రాగాద్యభ్యాసమునకును, నిరంతర విదేశవాసజనితవ్యాధ్యుపశమమునకును ఆంగికాద్యభినయమునకు నిచ్చివేయుదము. ఈలోపల నాంగికాభినయము కొంత తలయాటములోనగునది స్వయముగానే కలుగును. శేషము సులువుగా నేర్చుకొనవచ్చును. ఇట్లు షష్టి పూర్తియైనవారేగాని నటీనటులుగాగణన కెక్కఁజాలరు. ఈమర్యాదచే, 5, 10, 20-ఇత్యాది వయస్సులుగల, భరతకుమార చందనదాససుత శకుంతలానసూయాదిపాత్రములకును షష్టి పూర్తి చేసికొననివారు పనికిరారు. అందులకుఁ బైఁబడ్డ వృద్ధనటీనటులకు తదీయవయోభేదోచితముగా బాలయువత్యాది భూమికలను వేయవలయును. అంతట వహవ్వా 75 ఏండ్లశకుంతల, 85 ఏండ్లదుష్యంతుఁడును,-ఈయిద్దఱకును పెల్లి, వీరికి పుట్టునపుడే షష్టిపూర్తియైన కుమారుఁడుపుట్టును.

(7) వివిధప్రాకృతములు ఒకటి భాషించువారి కింకొకటి యర్థముగానియట్లుగా వెవ్వేఱు సలక్షణభాషలని పూర్వపక్షులు వాదింతురుగదా. అట్లగు నేని సంస్కృతనాటకములలో ఆంధ్రద్రావిడాది భాషలం గూడ చేర్పమియేల? ఆ కాలమున నాభాషలు లేవందురేమో?

"నబర్బరకిరాతాన్ధ్ర ద్రవిడాద్యాసుజాతిషు
నాట్యయోగేతుకర్తవ్యం కావ్యంభాషాసమాశ్రయమ్."

అని భరతమునియే వచించినాఁడుగదా. వీరివ్రాఁతలంబట్టి యిఁక నొకరూపకములో సలక్షణములైనయాంధ్రకర్ణాట ద్రావిడ మహారాష్ట్ర హరాణ హింద్యాదిభాషలు ప్రయోక్తవ్యముల యగునుగదా. అట్టిరూపకములను ఆంధ్రరూపకము లందమా, ద్రావిడరూపకము లందమా? "తతః ప్రవిశతి, ఇతి నిష్క్రాన్తాః," ఇత్యాది రంగోపదేశవాక్యము లేభాషనుండిన ఆభాషదా ఆనాటకము? దానికి కవీశ్వరుఁడు ఏభాషలో నామము పెట్టునో ఆభాషదా యది?

(8) ఈనాటకములందు ఉత్తమపాత్రములభూమికల ధరించువారెవరు? సత్పురుషులా? శూద్రులేమేని చేరుదురా?

"యాజ్ఞవల్క్యశిష్యస్తాండ్యాయన ఇతిఏవాభివర్తతే। తదస్యానవలోకనీయచతుర్థవర్ణస్య పురతః స్థాతుంనోచితమస్మాభిః। తదాగచ్ఛ। అన్యతోగచ్ఛామః"

అని సంస్కృతమును భాషించుశూద్రపాత్రమును ప్రసన్నరాఘవనాటకమునం గనవచ్చును. కుశీలవులను అమరుఁడు శూద్రవర్గలో చెప్పినాఁడేమి? మఱియు, నాటకప్రకరణాదికములను పురుషులుగాని స్త్రీలుగాని ఆడవచ్చునని భరతముని చెప్పియున్నాఁడు. అట్లు చేయుచో సంస్కృతపాత్రములభూమికలను స్త్రీలేగదా వేసికొనవలయును. మఱియు, రూపకభాషానియమమునకు స్వభావముగాని ఔచిత్యముగాని కారణముగాదఁటగదా? అట్లని ఆసీత యేభాష భాషించిన మన కేమి? ఇపుడు సీతాభూమికాధారియే గదా ఆభాషితముం జెప్పును. స్త్రీగాని, పురుషుఁడుగాని, బ్రాహ్మణుఁడుగాని, శూద్రుండుగాని ఆభూమికం దాల్పవచ్చునుగదా ? అట్లుండ నీమడిమైలలవిచారమేల ? నాటకమెల్ల సంస్కృతమయముగనే రచియింపరాదా? సామాజికులలో స్త్రీలు సంస్కృతము విననంగూడదని కారణమా! వారు వినకమానరు.

(9) వీరిలో కొందఱు గ్రామ్యము ప్రహసములందు ప్రయోక్తవ్యమని ప్రసాదించిరి. నాటకము మడియనియు ప్రహసనము మాత్రము మడిగాదనియు, వ్యవస్థాపింప వీరేమి యాపస్తంబులా? ప్రహసనము దశరూపకములలో చేరినదే.

"నాటకంసప్రకరణం భాణః ప్రహసనండిమః
వ్యాయోగసమవకారౌచ వీథ్యఙ్కేహామృగాదశ."

ప్రత్యవాయములు వీరు సమ్మతింపనిచోఁ గల్గునా? వీరిసమ్మతిచే నిలిచిపోవునా? ఔచిత్యముచే సమ్మతి యందురేని, మునింగినారు. దాన, సర్వరూపకములయందును ఉపరూపకములయందును గ్రామ్యము

ప్రయోక్తవ్యమ యగును. హాస్యరసమున కిది యనుకూలమందురేని, హాస్యము నాటకములయందును అపేక్షణీయమే.

"అఙ్గమన్యేరసాఃసర్వే కార్యనిర్వహణేఽద్భుతమ్."

(10) ఈపూర్వపక్షవాదులు కొందఱు రూపకములు వ్రాసియున్నారు. వీరికి, తెనుఁగున లక్ష్యలక్షణజ్ఞానము సున్న, సంస్కృతము తెలియనేతెలియదు [అందుఁగదా "నాట్య (లక్షణ) సాగరము" ఉన్నది], ఔచిత్యజ్ఞానము హుళక్కి. వీరు కొందఱు హూణుల డ్రామాలనైక్యముల వినియుందురేమోకాని పాటింపరు. ఇందుం గొందఱు హూణానువాదములను ఆంధ్రీకరించి తన్మూలములగు సంస్కృత నాటకములం దెనిఁగించిన ట్లభినయింతురు. వీరినాట్యశాస్త్రమిదిగో:—ఒకకథ, అది కొన్ని యంకములు, అంకము కొన్నిరంగములఁట, ప్రతిరంగము కొన్ని పాత్రభాషితములు, అని ఇంతియ. వీరిభాషాజ్ఞానము, scene అనుపదమును రంగమని యాంధ్రీకరించుకొనుటచేతనే తెల్లమగుచున్నది. వీరి "రంగము" కొంతవఱకు భరతోక్తమైన యంకలక్షణమును దాల్చియున్నది. ఆచొప్పున వీరి నాటకములలో 40 అంకములు, 50 అంకములును కలుగును. 10 అంకముల కెచ్చుకూడదని భరతమునిశాసనము. వీరి తెనుఁగు "డ్రామాలు" భరతాద్యుక్త రూపకోపరూపకములలో 28 టిలోను దేననుం జేరవు.

కొందఱు మదీయ నాగానందమునుం గని, భాషాభేదమావశ్యకమని గ్రహించియు, నామార్గమవలంబించిన నాశిష్యు లగుదురని ద్వేషించి, నీచపాత్రముల కచ్చతెనుఁగనియొకరసాభాస పునియమము కల్పించుకొని ? నిర్వహించుకోలేక పరమనీచపాత్రములకు నిజనియమవిరుద్ధముగా * తత్సమముం బెట్టుచు, ఋషికన్యాది సత్పాత్రములచే మాల

*ఎదిసాజపుఃబనియనియెద, రదియేసంబయ్యునిఁకువ నగుసెపశువులం జదుపుఁబనిఁగ్రామ్యుఁడయ్యును, పదయత చేశ్రోత్రియుండు సౌమ్యుండెయగుశ్.

ఇదియొక శాకుంతలమున చెంబడివానిపద్యము.

మాదిగలచేతనుంబోలె మహారాజును "పబువులు" అనిపించుచు, నీచపాత్రములైన చేటికాదులచే సీతాదిరాజకన్యాదులను, అతినమ్రతతో అతిసుకుమార సంబోధనచేయవలసినచో, అతితిరస్కారసూచకముగా మౌండ్యకశాఘాతాంగకర్తనాంకననిర్వాసనాది దండార్హముగా "రాచకూతురా" అని సంబోధనచేయించుచు, నటిని సూత్రధారునిచే "దేవీ" యని దేవిరింపించుచు, సూత్రధారుని నటిచే "దేవా" యని అఘోరింపించుచు, గ్రామ్యనాటకములు వ్రాయుచున్నారు.

"గ్రామ్యత్వమనౌచిత్యం। వ్యవహారాకారవేషవచనానామ్
దేశకులజాతివిద్యా। విత్తవయఃస్థానపాత్రేషు." రుద్రటుఁడు.
వ్యాఖ్య:......"వచనం భాషా." నేమిసాధువు.

ఇందువలన నుత్తములకు నీచభాష (గ్రామ్యభాష) పెట్టుటయు నీచులకు ఉత్తమభాష (వ్యాకృతభాష) పెట్టుటయు గ్రామ్యతాదోషావహములనియు, మదీయప్రతిపక్షులకు గ్రామ్యాగ్రామ్యస్వరూపము తెలియదనియు, విశదముగదా.

వీరిరూపకములలో ౧. వాచికాభినయభంగము, ౨. ఔచిత్యభంగము, 3. రసశూన్యత, ౪. ఆంధ్రశారదను అంతరించినభాషగాం జేయుటయు. వీరు తమరూపకలక్షణానభిజ్ఞతనుకప్పుకొనువారై రసముకొఱకు లక్షణ ముల్లంఘించితి మని పీఠికలలో బూటకములు వ్రాసికొందురు. భాషానియమము వీరుచెప్పినట్లయగు నేనియు రసముకొఱకు ఆనియమమును అన్యులు ఏల యుల్లంఘనము సేయరాదు.

వీరిలో కొందఱు అచ్ఛమిశ్రభేద నిర్వహణములో కణ్వ దుష్యంతాద్యుత్తములపద్యములయందు ఎక్కువగా నచ్ఛపెట్టి వారికి నీచత్వం గల్పించినారు. ఇట తత్సమతద్భవ దేశ్య పదములను పాత్రగుణానుసారముగా, ఉత్తములకు 3, 2, 1, మధ్యములకు 2; 2, 2, అధములకు 1, 2, 3, అనియేని కందాయములవలె పంపకము సేయవలయునా? పరిశుద్ధమైన యచ్ఛచే నీచతయెట్లు తెలియును? ఈద్వైతముచే నీచనీచతరాది

భేదమెట్లేర్పడును? ఆయద్వైతమున ఆభేదములు లేనే లేవుగదా? మధ్యమపాత్రములమధ్యత యెట్లు తెలియును? మరియు, సులువుగా నుండవలసిన రూపకరచన అచ్చునియమముచే కాఠిన్యముఁబొరయదా? నీచపాత్రనీచభాషాభేద నిర్వాహ్యములైన యంకగోష్ఠీప్రేంఖణ రాసకాదులగతి తెలుఁగున నధోగతియ గావలసినదా? (అచ్చతెనుఁగు శాకుంతలమఁట: పూర్వపక్షులమతమున సర్వప్రాకృతశాకుంతలముఁగదా దానికి తగినమూలము? అట్టిశాకుంతలమున్నదా?) ఈనాటకములో నీచపాత్రలకు అచ్చతెన్గు పెట్టితిమని ముందుగాసామాజికులకు ప్రకటనసేయుదురా? చేయఁడు, చేసినను ఆభేదమును కనిపట్టువారు వారిలో నూర్గురి కొకరేని యుందురా? ఉందురుపో, ఆయొక్కరికొఱకా యీప్రయోగక్లేశము? సంస్కృతము తెలియని యీకవిగారు తెనుఁగుశబ్దము విన్నమాత్రాన నది తత్సమమో తద్భవమో దేశ్యమో చెప్పఁగలరా? సామాజికులనుతర్వాత పరీక్షింతము. స్వారవర్ణికమునిగదా మహేంద్రుఁడు ప్రార్థించెను? గ్రామ్యము పల్కినఁగదా, ఈపాత్రముయోగ్యత ఇట్టిదని సామాజికులకు వెంటనే తెలియును ? మధ్యమధ్యను కవిగారు ఆడించుకొనుచువచ్చి ఇది నీచపాత్రముఅని చెప్పిపోవుచుందురా ? అచ్చతెన్గు ఇట్లు పనికిరాకపోయెఁగదా? గ్రామ్యముంగొననిచో నుత్తమపాత్రముల మాహాత్మ్య పరిభ్రంశాదులను సూచించుట యెట్లు? యథాలిఖితవాచనమందు గ్రామ్యమును తప్పించుట యెట్లు? కావున గ్రామ్యము సరసరూపకరచయితలకు కంఠాభరణముగాను, విరసరూపకరచయితలకు కంఠపాశముగాను, తగులుకొన్నది. ఏమిచేసినను తొలఁగదు. కొంద ఱెవరేని సంస్కృతమును భాషించిరో లేదో, భాషింపనివారున్న నుందురుగాక, వారెల్ల భాషింపవలసినవారుగావున, ఆయౌచిత్యముచే వారికి సంస్కృతము పెట్టుమని భరతాదేశము. శాతవాహనుఁడు మహిషీపరిభూతుఁడు కాకముందు ప్రాకృతభాషియే, అనంతరము ఆఱుమాసములకావల సంస్కృతభాషియే. ఆతనిచరితము రూపకముచేసినచో ఆభేదమును నిర్వహింపవల

యనుగదా, అట్లు ఎల్లరచరితమును తెలియదు గావున తెలియనితావుల సామాన్యౌచిత్యము నవలంబింపవలయును. పూర్వము గొప్పవారు సంస్కృతమే మాటలాడుచుండిరి. ఆయాచారము రూపకములందు నిబద్ధమైనది. మనము పూర్వచరితమే ప్రాయికముగా వ్రాయుదుము గావున, ఉత్తమపాత్రములకు, వారు గ్రామ్యముపల్కిరను నిశ్చయము లేనందున, వ్యాకృతము పల్కవలసినవారగుటచేత, వారికి వ్యాకృతమే పెట్టుచున్నాము. పాటలు మొదలైనవి కొన్ని స్వాభావికములుగావు గాని స్వభావమునకు పైగా నాట్యధర్మిరూపకమందు రంజనార్థము వానిని చేర్చుకొమ్మని భరతాదేశము. లోకధర్మియందవి చేరవు.

## XIII.

అతివాక్యక్రియోపేత మతిసత్త్వాతిభావికమ్
లీలాఙ్గహారాభినయం నాట్యలక్షణలక్షితమ్.
స్వరాలంకారసంయుక్త మశ్వస్థపురుషాశ్రయమ్
యదీదృశంభవేన్నాట్యం నాట్యధర్మీతుసాస్మృతా.

స్వరాలంకారములు పాఠ్యధర్మములు.

లోకేయదభియోజ్యంతు భద్రమత్రోపయుజ్యతే
మూర్తిమత్సాభిలాషంచ నాట్యధర్మీతుసాస్మృతా.
అత్రోక్తంచైవయద్వాక్యం నశృణ్వన్తిపరస్పరమ్
అనుక్తంశ్రూయతేయచ్చ నాట్యధర్మీతుసాస్మృతా.
శైలయానవిమానాని చర్మవర్మాయుధధ్వజాః
మూర్తిమన్తఃప్రయుజ్యన్తే నాట్యధర్మీతుసాస్మృతా
లలితైరఙ్గవిన్యాసైః తథోత్క్షిప్తపదక్రమైః
నృత్యతేగమ్యతేచాపి నాట్యధర్మీతుసాస్మృతా.

రంగమందు మృతిని సాంగోపాంగముగాఁ జూపి మృతభూమికాధారిచుట్టును ముగ్గురిని సుందరీమణీభూమికాధారులం గూర్చుండఁబెట్టి పరిదేవనము పాడించినదానింగని యేడ్చులఘుహృదయసామాజికుల

బాష్పములు ఆ 'డ్రామా' వలని కరుణరసమా? ఇది యవలక్షణముగా దఁట ! సరస మఁట ! గ్రామ్యము నింద్యమఁట ! నీచపాత్రలకు గ్రామ్యము పెట్టని 'డ్రామా'లంగూర్చి భరతముని చేసినశాసనమును వినుఁడు:—

## XXV.

ప్రత్యఙ్గ హీనంయత్కావ్యం వికృతంచ ప్రయుజ్యతే
నలక్షణకృతస్తస్య కార్యస్త్వభినయోబుధైః.
భావాయేఉత్తమానాన్తు నతాన్మధ్యేషుయోజయేత్
యేభావాశ్చైవమధ్యానాం నతాన్నీచేషుయోజయేత్.
వాగఙ్గసత్త్వోపేతాః కావ్యార్థాః భావయన్తీతిభావాః.

## XXVII.

యోదేశవేషభాషారహితం కావ్యం ప్రయోజయేద్దుష్టమ్
తస్యాప్యభిలేఖ్యస్యా ఘాతస్తజ్ఞైర్హిదోషజ్ఞైః

భరతముని ఇట్టికురూపకములనాడవలదని కుశీలవులకు ఆనవెట్టి, ఇట్టికురూపకములకు ఘాతవెట్టుండని దోషజ్ఞులకు ముదలవెట్టినాఁడు గదా, అవధరింపుఁడు.

ఈలఘుచర్చచే సిద్ధాంతితము:—గ్రామ్యత్యాగిరూపకమే గ్రామ్యరూపకము, అశాస్త్రీయము, కురూపకము. గ్రామ్యగ్రాహియే అగ్రామ్యము, శాస్త్రీయము, సురూపకము.

---

"యాన్తినాన్యాయప్రవృత్తస్య తిర్యఞ్చోపిసహాయతామ్
అపన్థానంతుగచ్ఛన్తం సోదరోపివిముఞ్చతి."

సంపూర్ణము.

---

శ్రీశారదార్పణమస్తు.

చంద్రికాప్రెస్, చాకలపేట, చెన్నపురి—1934